SIMULTANEOUSLY PUBLISHED FROM VIJAYAWADA AND MADRAS



# ఆంధ్రపత్రిక

ఆంధ్రపత్రిక చందా వివరాలు

| | పోస్టుద్వారా రు. పై. | ఏజంటుద్వారా రు. పై. |
|---|---|---|
| 1 సంవత్సరము | 62-00 | 44-00 |
| 6 నెలలు | 31-00 | 22-00 |
| 3 నెలలు | 15-50 | 11-00 |
| 1 నెల | 5-25 | 3-75 |

మేనేజరు, ఆంధ్రపత్రిక

Regd H. NO 506 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO సంపుటం 55, సంచిక 239

విజయవాడ, సోమవారం 2-12-1968 THE ANDHRA PATRIKA ఉదయం *** 6 పుటలు : 12 పైసలు

# గ్రామీణ ప్రాంతాలలో కాంట్రాక్టు పద్ధతిని రోడ్ల నిర్మాణం

## బస్ ఆపరేటర్లకు ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి సూచన

### అక్ట్రాయ్ పన్ను స్థానే కొత్త పన్నులు: కేంద్రమంత్రి వి. కె. ఆర్. వి. రావు విజ్ఞప్తి

### విశాఖలో 15 వ రాష్ట్ర బస్ ఆపరేటర్ల మహాసభ

(స్వకీయ విలేఖరి) విశాఖపట్నం, డిసెంబర్ 1:

రాష్ట్రంలోని గ్రామీణ ప్రాంతాలలో మోటారు వాహనాలను నడుపదల్చుకున్న, స్తోమతిగల "మోటారు ఆపరేటర్"లు ముందుకు వచ్చి కంట్రాక్టు ప్రాతిపదికమీద ఆయా ప్రాంతాలలో రోడ్ల నిర్మాణానికి పూనుకోవాలని ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి నేడిక్కడ ఆంధ్ర ప్రదేశ్ మోటారు రవాణా యజమానుల 15 వ మహాసభకు అధ్యక్షత వహిస్తూ విజ్ఞప్తి చేశారు.

మోటారువాహనాలపై పన్నులు చాలా ఎక్కువగా వున్నాయన్నవాదంతో తాను అంగీకరించ జాలమని ముఖ్యమంత్రి యీ సందర్భంలో పేర్కొన్నారు.

కేంద్రరవాణా నౌకా వ్యవహారాలమంత్రి డా: వి.కె.ఆర్.వి. రావు యీ సమావేశాన్ని ప్రారంభిస్తూ "కొన్నిరాష్ట్రాలు అక్ట్రాయ్" పన్నువసూలు చేస్తున్నాయని వాటిలో కొన్ని రాష్ట్రాలు యీ 'అక్ట్రాయ్' వసూలును ... పరిపాలనాధికారులకు ... అప్పగి...యని తెలుసుకొని చాలా ఆందోళన ...తీలన్నామని అన్నారు.

...టికెట్ సుంకాల లెవీ పరిశీలక సంఘం ... తగి...ను, ప్రణాళికా సంఘం ...ఖ్యనిగావున్న శ్రీ వి. కె. ఆర్. వి. రావు తాము అక్ట్రాయిపన్ను విధింపుకు వ్యతిరేకులం అన్నారు. అది తొలగింపబడాలని ఆశిస్తున్నామని అన్నారు. "అక్ట్రాయి వసూలుకు వ్యయం చేయవలసి వుంటుంది కూడా. కనుక ఆదాయాన్ని పెంపొందించేటందుకు యితర మార్గాలను వెతకాలని' కేంద్రమంత్రిఅన్నారు.

"ఇతరత్రాపన్నులను కనుగొనాలని"ఆయన అన్నారు.

ఆయన యింకా యిలా అన్నారు. "రవాణా సర్వీసులను సమన్వయంచేయాలి అనుకున్నప్పుడు మనం ట్రాఫిక్ అవసరాలకు సంబంధించిన నిజానిజాలను క్షుణ్ణంగా తెలుసుకోవాలి. అంతేగాక యీ ట్రాఫిక్ అవసరాలు రాష్ట్రాల వారీగా చేయాలి. జాతీయ స్థాయిలో యీ అంచనాలనుకడితే అవి తప్పుపోవచ్చును. అందువల్ల అనేకమైన ప్రయోజనాలను యీ విషయంలో పరిశీలించాలి. నిజానికి రైల్వేలు లాభాలు చేయాలని యీ లాభాలను యితర రవాణా సౌకర్యాలకు అందజేయాలని ప్రభుత్వం అనుకుంటుంది" అని కేంద్ర మంత్రి వివరించారు. "లేదా అవసరమైన ధనాన్ని ఇతర పన్నులు వేయటంవల్ల సేకరించవలసి వుంటుంది"అంటూ డా: రావు కేంద్రప్రభుత్వం నిర్ణీతమైన గ్రాంట్‌లను యివ్వలేదని, రాష్ట్రాల నిమిత్తం 3500 కోట్లు కేటాయించివున్నదనీ, దీనినే రాష్ట్రాల మధ్య పంపిణీ చేయాలని వివరించారు. అయితే వచ్చే ఏడాది యింకా కొంచెంపైకం రాష్ట్రాలకుగాను అందజేసేవీలుండవచ్చునని కూడా యీ సందర్భంలో అన్నారు.

పై విషయాలను కేంద్రమంత్రిప్రధాన కార్యదర్శి శ్రీ వై.రామబ్రహ్మం నివేదికలో కోరిన కోరికలకు సమాధానంగా చెప్పారు.

శ్రీ రావు "ప్రభుత్వం రోడ్డు రవాణా సంస్థల జాతీయీకరణం విధానానికి కట్టుబడి వుంటుందని ఉద్ఘాటించారు. మహారాష్ట్రలో యీ విధానం 99 శాతం, గుజరాత్ నూటికినూరుపాళ్ళు విజయవంత

(మిగతా 2 వ పేజీలో

### మంత్రి కర్తవ్యం: తిమ్మారెడ్డి సందిగ్ధం

హైదరాబాదు, డిసెంబర్ 1:

మంత్రిగా అనుభవం ఎనిమి దేళ్ళు ఉన్నప్పటికీ మంత్రి విధులేమిటన్న విషయంపై వ్యవసాయమంత్రి శ్రీ తిమ్మారెడ్డికి యిప్పటికీ సందిగ్ధంగానేఉంది.

మంత్రి పని అధికారులు తమ ముందు పెట్టే ప్రతిపాదనలను ఆమోదించడమా, లేక ప్రజల అనుభవాలను, అధికారుల ప్రతిపాదనలను సమన్వయ పరచడమా?

తాము యీ రెంటినీ సమన్వయపరచే పాత్రను నిర్వర్తించవలసి ఉన్నదని ఆయన భావిస్తున్నారు. కాని అటు ప్రజల అవసరాలను తీర్చలేక, ఇటు అనాయుడు కారులతో పూర్తిగా ఏకీభవించనేయస్వామి ఆయన విస్పష్టయ స్థితిలో ఉన్నట్టున్నారు (47) ...బ్రాంహో ... భావిస్తున్నారు.

## మిర్చి, బెల్లం, ద్రాక్షలకు విదేశాలలో అవకాశాలు

### పరిశీలనకు రైతుల వ్యాపారుల ప్రతినిధి వర్గాన్ని పంపే ఆలోచన తిమ్మారెడ్డి వెల్లడి

హైదరాబాదు, డిసెంబరు 1:

ద్రాక్ష, మిర్చి, బెల్లం మొదలైన సరకులకు విదేశీ మార్కెట్ల అవకాశాలను గురించి పరిశీలించడానికి రైతుల వ్యాపారుల ప్రతినిధి వర్గాన్ని ఒకదానిని పంపే విషయం ప్రభుత్వ పరిశీలనలో ఉన్నదని రాష్ట్ర వ్యవసాయ శాఖామంత్రి శ్రీ తిమ్మారెడ్డి నేడు వెల్లడించారు.

శ్రీ తిమ్మారెడ్డి నేడిక్కడ ఒక రైతు సదస్సులో మాట్లాడుతూ, సమాజంలోని ఇతర వర్గాల మాదిరిగా రైతులు కూడా సంఘటితం కావాలనీ, అప్పుడే వారి సమస్యలు అన్ని స్థాయిలలోను తీరగలవనీ తెలిపారు. అయితే రైతులను ఉద్రిక్తపరిచే దృష్టిలో తామీ సలహా ఇవ్వడం లేదనీ, దేశ ఆహారపదార్థాల అవసరాలను తీర్చడానికి ఎక్కువగా ఉత్పత్తి చేయడానికి ప్రోత్సహించేందుకేననీ చెప్పారు.

కొన్ని పదార్థాలను ముఖ్యంగా సోయా బీన్ నూనెను దిగుమతి చేసుకొనడాన్ని మంత్రి విమర్శిస్తూ, దీనివల్ల వేరుశనగ నూనె ధర పడిపోయిందన్నారు. ఇలాంటి కొన్ని వస్తువులను ప్రజలపై రుద్దే దృష్టిలో మాత్రమే దిగుమతికి అంగీకరిస్తున్నారా అని ఆశ్చర్యం కలుగుతోందన్నారు.

రైతులు అన్ని స్థాయిలలోను సంఘటితమైతే, మంచి భవిష్యత్తును ఎదురు చూడవచ్చుననీ, వారి కోర్కెలు పరిష్కారం కాకుండా ఉండవనీ అన్నారు.

ఈ సందర్భంగా ఆయన రైతు సదస్సు

(మిగతా 3 వ పేజీలో)






## రాష్ట్ర వ్యవసాయాభివృద్ధికి ప్రపంచ బ్యాంకు సహాయంపొందే ప్రయత్నం

### కోస్తా జిల్లాల్లో, తెలంగాణా అభివృద్ధికి రు 60 కోట్లు ఖర్చుకాగల ... పథకాల సమర్పణ

హైదరాబాదు, డిశంబరు 1:

వ్యవసాయాభివృద్ధికి ... గత ... బృహత్తర పథకాలను గురించి ఇక్కడకువచ్చిన ప్రపంచ బ్యాంకు ప్రతినిధులతో ... ప్రభుత్వ అధికారులు చర్చించారు. ఈ పథకాలు కార్యరూపం దాలిస్తే రు. 60 కోట్లు ఖర్చు కాగలదని అంచనా.

వ్యవసాయశాఖ డైరెక్టర్ శ్రీ టి.వి. రెడ్డి యు.ఎన్.ఐ. విలేఖరితో మాట్లాడుతూ ఆంధ్రప్రాంతంలో కోస్తా జిల్లాలలో 7500 గొట్టపు బావుల త్రవ్వకం పథకాన్ని, కరీంనగర్, వరంగల్, నిజామాబాద్ జిల్లాలకు సంబంధించిన ప్రాంతీయ అభివృద్ధి పథకాన్ని ప్రపంచ బ్యాంకు ప్రతినిధివర్గానికి అందజేసినట్లు తెలిపారు.

ఈ రెండు పథకాలలో ఒక్కొక్కదానికి సుమారు రు. 30 కోట్లు ఖర్చవుతుంది.

దేశంలో వ్యవసాయాభివృద్ధికి అగ్రికల్చర్ రీఫైనాన్స్ కార్పొరేషన్‌ద్వారా ప్రపంచ బ్యాంకు తన సహాయాన్ని అందజేస్తుంది.

### ఉగ్రవాదుల యత్నం

కాలికట్, డిసెంబర్ 1: వైనాడ్ ప్రాంతంలోని చెరాడి సమీపంలో గల ఒక ఎస్టేటు కంట్రాక్టరు గృహంపై గత శనివారం రాత్రి నక్సలైట్ వర్గానికి చెందినట్లు చెప్పబడుతున్న కొందరు వ్యక్తులు దాడి చేసి దోచుకోడానికి ప్రయత్నించినట్లు ఇక్కడకు వార్తలు అందాయి.

### టెలివిషన్‌లో తిరుమల అర్చన దృశ్యాలు

#### తిరుపతి ధర్మకర్తల సంఘం విముఖత

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాద్, డిశంబరు 1: తిరుపతి దేవాలయములో జరిగే ఉత్సవాలు బయట ఉన్న భక్తులు టెలివిషన్‌ద్వారా చూడటానికి యేర్పాటు చేయాలని మాజీ గవర్నర్ శ్రీ ఎమ్. అనంతశయనంఅయ్యంగార్ దేవాదాయ శాఖకు సూచించినట్లు తెలుస్తున్నది. తిరుమల తిరుపతి దేవస్థానము యొక్క ఆగమశాస్త్ర పండితులు ఇది ఆగమశాస్త్రానికి విరుద్ధమని సలహాయిచ్చారు. దేవస్థానము ధర్మకర్తల సంఘము వారుకూడా యిప్పటిగోష్ఠి చర్చలలో యీ సూచనకు వ్యతిరేకముగా అభిప్రాయాన్ని వెలిబుచ్చినట్లు కూడా తెలుస్తున్నది.

—:0:—

### ఆంధ్రలో ఐక్య సంఘటన

#### ప్రతిపక్షాలకు మితవాద కమ్యూనిస్టుపార్టీ సూచన

హైదరాబాదు, డిసెంబరు 1: ఆంధ్రప్రదేశ్‌లోని వామపక్ష, ప్రజాస్వామ్య పార్టీలన్నీ కనీస సమిష్టి కార్యక్రమంపై, ఐక్య సంఘటనగా ఏర్పడాలని రాష్ట్ర మితవాద కమ్యూనిస్టు పార్టీ మండలి సూచించింది.

పార్టీల మధ్య గల విభేదాలు ఫ్రంట్ ఏర్పాటుకు అవరోధం కానవసరంలేదనీ, యీ తీర్మానంలో పేర్కొన్నారు.

మండలి ఆమోదించిన యీ తీర్మానాన్ని నేడు పత్రికలకు విడుదల చేశారు.

ప్రజల ప్రధాన సమస్యలలో మితవాద కమ్యూనిస్టు పార్టీ, మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ, రివల్యూషనరీ కమ్యూనిస్టు, ఎస్. ఎస్. పి., పి. ఎస్. పి., ఇతర ప్రజాస్వామ్య పక్షాల వ్యక్తులు అత్యంత ఆసక్తి కలిగి ఉన్నారని కూడా తీర్మానంలో పేర్కొన్నారు.

నాగర్‌కోయిల్, డిసెంబర్ 1: శ్రీ నేసమణి మృతివల్ల నాగర్‌కోయిల్‌నుంచి లోక్ సభకు జరుగనున్న ఉప ఎన్నికలో కాంగ్రెస్ మాజీ అధ్యక్షుడు శ్రీ కామరాజును ముగ్గురు పోటీ...

## రాజమండ్రిలో ఒక వ్యక్తి హత్య

రాజమండ్రి, డిశంబరు 1: ఇక్కడి ఇండియన్ ఆయిల్ కంపెనీలో గుమాస్తాగా ఉన్న ఎస్. అబ్రహాం రత్నాకర్ (22 సం) నిద్ర పోతూండగా గతరాత్రి 2—30 గంటల ప్రాంతంలో ఎవరో వ్యక్తి కత్తితో పొడిచాడు. ఆయనను ఆసుపత్రికి తీసుకు వెడుతుండగా చనిపోయాడు. ఈయనతలిదండ్రులు అలమూరులో ఉపాధ్యాయులుగా పని చేస్తున్నారు. పోలీసు దర్యాప్తు సాగుతోంది. (స్వ. వి)

## పత్రికా రంగానికి దేశోద్ధారకుని సేవ

### రాజేశ్వరరావు సంగీతోత్సవాలలో గవర్నర్ ఖండూభాయ్ దేశాయ్ ప్రశంస

'ఆంధ్రపత్రిక' ప్రతినిధి హైదరాబాద్, డిశంబర్ 1:

ఆంధ్రప్రదేశ్ పత్రికా రచయితల సంఘంవారు దేశోద్ధారక భవన నిర్మాణ సహాయార్థం నిర్వహించిన రాజేశ్వరరావు సంగీత దినోత్సవంలో ప్రధాన అతిథి గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ప్రసంగిస్తూ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు దేశానికి, రాష్ట్రానికి చేసిన సేవలను కొనియాడారు.

శ్రీ దేశాయి ప్రసంగిస్తూ, "తెలుగు పత్రికారంగానికి చిరస్మరణీయమైన సేవ చేసిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి పేరు పత్రికా రచయితల భవనానికి పెట్టడం ఎంతైనా సముచితమని శ్లాఘించారు.

దేశానికి, రాష్ట్రానికికూడా పంతులుగారు చేసిన సేవలను ఆయన కొనియాడారు. ఈ సంగీతోత్సవంలో పాల్గొన్న కళాకారులను ఆయన అభినందించారు.

పత్రికా స్వాతంత్ర్యం ప్రజాస్వామ్యానికి రక్షణ కాగలదనీ, భారతదేశంలో పత్రికలకు స్వాతంత్ర్యం బాగానే ఉన్నదని చెప్పారు. దేశంలో సర్వ ఉద్యమాలను తీర్చి దిద్దే పత్రికా రచయితలు ఈ సంగీతోత్సవాన్ని ఏర్పాటు చేసిన తీరు తెన్నులు, సమావేశానికి వచ్చిన వివిధరంగాలప్రజలను, పెద్దలను, పిన్నలనుచూసినప్పుడు రాజధాని నగరంలో గల బ్రహ్మాండమైన పలుకుబడి వ్యక్తమవుతున్నదని చెప్పారు.

శ్రీ సి. నారాయణరెడ్డి వ్యాఖ్యాతగా వ్యవహరించారు.

శ్రీ ఎస్. రాజేశ్వరరావుతోపాటు ఉత్సవంలో పాల్గొన్న శ్రీ ఘంటసాల వేంకటేశ్వరరావు, శ్రీ పి.బి. శ్రీనివాస్, శ్రీ మాధవపెద్ది, శ్రీ పిఠాపురం నాగేశ్వరరావు, శ్రీమతి సుశీల, శ్రీమతి జానకిగారలకు ముఖ్యమంత్రి సతీమణి శ్రీమతి రాఘవమ్మగారు పుష్పగుచ్ఛాలు సమర్పించిన తర్వాత గవర్నర్ బహుమతుల ప్రదానం గావించారు.

చలనచిత్ర రచయితల పక్షాన శ్రీ ఆరుద్ర, పాటలు రచయితల పక్షాన డాక్టర్ సి. నారాయణరెడ్డి, శ్రీ రాజేశ్వరరావును శాలువలతో, వస్త్రాలతో సత్కరించారు.

శాసనమండలి అధ్యక్షుడు శ్రీ పిడతల రంగారెడ్డి, మంత్రులు శ్రీయుతులు తోట రామస్వామి, ఎస్. సిద్ధారెడ్డి, కె.వి. నారాయణరెడ్డి, పి.వి. నరసింహారావు, రాష్ట్ర పోలీసు ప్రధాన అధికారి శ్రీ ఆత్మ జయరాం, శాసనసభ్యులు, ఇతర అధికార, అనధికార ప్రముఖులు హాజరైనారు.

జనసంబంధ శాఖ మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్, ఈ శాఖ డైరెక్టర్ శ్రీ బి. కె. రావు కూడా ఈ ఉత్సవానికి హాజరయ్యారు.

క్రిక్కిరిసిన ప్రేక్షక జనం ఉన్నప్పటికీ చివరి వరకు ఉత్సవం రక్తి కట్టింది.

శ్రీ రాజేశ్వరరావు స్వరకల్పన చేయగా శ్రీ ఘంటసాల, శ్రీ పి.బి. శ్రీనివాస్, శ్రీమతి సుశీల, ఇతర కళాకారులు మొత్తం 32 పాటలు పాడారు. మధ్య రాజేశ్వరరావుకూడా రెండు పాటలు పాడారు. అంతటితో పూరుకోక ఘంటసాలతో కలసి 'మల్లీశ్వరి' లో 'అందాల వో మేఘమాల' పాట పాడారు. ప్రేక్షకులు ముగ్ధులయినారు.

శ్రీ నాగేశ్వరరావుపంతులుగారి శతజయంతి ఉత్సవ సందర్భంలో శ్రీ సి. నారాయణరెడ్డి వ్రాసిన "జోహారు జోహారు వో విశ్వదాతా" అన్న గేయాన్ని శ్రీయుతులు ఘంటసాల,

(మిగతా 2 వ పేజీలో)

## దేశ సంపద సమీకరణ ముఖ్యం

### పమూడక్టు ప్రారంభోత్సవ సభలో వి. కె. ఆర్. వి. రావు సూచన

విజయవాడ, డిసెంబరు 1:

దేశంలో సంపద లేక కాక సంపదను సమీకరించకపోవటం వల్లనే మన అవసరాలను తీర్చుకోలేకపోతున్నామని, పేదరికాన్ని నిర్మూలించలేకపోతున్నామని యీరోజు సాయంత్రం యిక్కడ 45 లక్షల రూపాయల వ్యయంతో నిర్మించిన పమూడక్టు బైపాస్ జాతీయ రహదారికి ప్రారంభోత్సవంచేస్తూ కేంద్ర కమ్యూనికేషన్ల మంత్రి శ్రీ వి. కె. ఆర్. వి రావు స్పష్టం చేశారు.

ఈ ప్రారంభోత్సవ సభకు అధ్యక్షత వహించిన రాష్ట్ర కమ్యూనికేషన్ల మంత్రి శ్రీ జె. వి. నరసింగరావు తమ ప్రసంగంలో ఆంధ్రప్రదేశ్‌కు నాల్గవ పంచవర్ష ప్రణాళికలో రోడ్లు, బ్రిడ్జిల నిర్మాణానికి 46 కోట్ల రూపాయలు అవసరమని, కనీసం 25 కోట్లయినా సహాయం చేయాలని కోరారు.

కేంద్రమంత్రి డా. కె. ఎల్. రావు, రాష్ట్ర శాసన సభ్యులు డా. టి. వి. ఎస్. చలపతిరావు ప్రసంగించారు. పబ్లిక్‌వర్క్స్ శాఖ చీఫ్ ఇంజనీయర్ శ్రీ ఎ. ఆర్. సత్యనారాయణరావు స్వాగతం పలికారు. సూపరింటెండింగ్ ఇంజనీరు శ్రీ పి. ఏతిరాజులు వందన సమర్పణచేశారు.

## తజకిస్థాన్‌లో ప్రాచీన సంస్కృత పత్రం!

న్యూఢిల్లీ, డిసెంబరు 1 : దక్షిణ తజకిస్తాన్‌లోని కపిర్-కలాలో ఏనిమిదవ శతాబ్దానికి చెందిన దేవాలయంలో త్రవ్వకాలు సాగిస్తుండగా, భారతీయ బ్రాహ్మీ లిపిలో పెక్కు అక్షరాలుగల చిన్న కొండరావి చెట్టు బెరడు కనిపించింది.

ఈ అక్షరాలు ఏడవ శతాబ్దినాటి బవుద్ధ రచనల్లో భాగంగా కనిపిస్తున్నది. బవుద్ధ గ్రంథమైన అంశాలుగల ఇలాంటిపత్రాలు ఇదివరలో ఉజ్బెకిస్తాన్, టర్క్మెనిస్తాన్‌లలో కనిపించాయి.

సోవియెట్ రిపబ్లిక్‌లో సంస్కృత భాషలోగల పత్రాలు లభ్యం కావడం ఇదే మొదటిసారి.

---

న్యూఢిల్లీ, డిసెంబర్ 1 : అనురాపూర్ గ్రామంలో రాంభాయ్ అనే హరిజనుని మృతి గురించి గుజరాత్ ముఖ్యమంత్రి శ్రీ హితేంద్రదేశాయ్ కేంద్ర ఆహారమంత్రి శ్రీ జగ్‌జీవన్‌రామ్‌కు ఒక వర్తమానం పంపినట్లు తెలుస్తున్నది.

---





హైదరాబాద్‌లోని రవీంద్రభారతిలో నవంబరు 27న గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ సమక్షంలో సోవియెట్ కళాకారుల బృందంవారు సాంస్కృతిక ప్రదర్శనలు ఇచ్చారు.

# లాటరీ పథకాల నిర్వహణకు అనేక రాష్ట్రప్రభుత్వాల యోచన

న్యూఢిల్లీ డిశంబర్ 1:

కొన్ని రాష్ట్రాలు ప్రారంభించిన లాటరీలు విశేషంగా లాభాలను ఆర్జించడంతో, మరికొన్ని రాష్ట్రాలు గూడా యీ పథకాలను చేపట్టాలని యోచిస్తున్నాయి

యు.ఎన్.ఐ. వార్తాసంస్థ జరిపిన సర్వేలో ఈ అంశం వెల్లడైంది. ఢిల్లీ కేంద్రపాలిత ప్రాంతమూ, బొంబాయి నగరపాలక సంస్థ కూడా ఈ పథకాలను నిర్వహించాలని యోచిస్తున్నాయి.

మొట్టమొదట లాటరీలు ప్రారంభించిన ఘనత కేరళలోని యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వానికే దక్కినప్పటికీ, అతి పెద్ద లాటరీ పథకాన్ని మద్రాసులోని ద్రవిడ మున్నేట్ర కజగం ప్రభుత్వం నిర్వహిస్తున్నది. మద్రాసు ప్రభుత్వం నిర్వహించిన రెండవ లాటరీలో లక్ష రూపాయల 14 మొదటి బహుమతులు ఇచ్చారు. మూడవ లాటరీలో 14 లక్షల రూపాయల బహుమతులు ఇవ్వాలని సంకల్పించారు.

కాంగ్రెసు ప్రభుత్వాలు అధికారంలో ఉన్న హర్యానా, రాజస్థాన్ ప్రభుత్వాలు, యునైటెడ్ ఫ్రంటు ఆధికారంలోగల పంజాబు ప్రభుత్వముకూడా లాటరీలను ప్రారంభించాయి. రాష్ట్రపతి పాలనగల పశ్చిమబెంగాల్, ఉత్తరప్రదేశ్ ప్రభుత్వాలుకూడా లాటరీలను ప్రారంభించాలని యోచిస్తున్నాయి.

లాటరీ పథకాన్ని నిర్వహించాలని మైసూరు ప్రభుత్వంకూడా నిర్ణయించి, ఇతర రాష్ట్రాల నుండి ఈ సంబంధమైన సమాచారాన్ని సేకరిస్తున్నది.

### లాటరీలవల్ల సినిమాల ఆదాయం తగ్గుదల

మద్రాసు ప్రభుత్వం నిర్వహిస్తున్న లాటరీల వలన రాష్ట్రంలోని సినిమా హాళ్లలో టికెట్ల అమ్మకం 30 నుండి 35 శాతం తగ్గినట్లు అంచనా వేస్తున్నారు.

లాటరీ పథకాల నిర్వహణను కొందరు వృద్ధ నాయకులు నిశితంగా విమర్శిస్తున్నారు. స్వతంత్రపార్టీ నాయకుడు శ్రీ రాజగోపాలాచారి ఈ పథకాన్ని విమర్శిస్తూ అనేక వ్యాసాలు వ్రాశారు. లాటరీలను నిర్వహించే అధికారం రాష్ట్రప్రభుత్వాలకు లేదనీ, లాటరీ పథకంపై చట్టం చేసేటందుకు కేంద్రప్రభుత్వం సుప్రీంకోర్టును సంప్రదించాలనీ ఆయన సూచించారు.

గుర్రపు పందేలు జూదం కానప్పుడు, లాటరీలు జూదం ఎలా అవుతాయి? అని కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు ప్రశ్నిస్తున్నాయి.

### మద్రాసుకు 4 కోట్ల ఆదాయం

ఈ ఆర్థిక సంవత్సరం ముగిసే లోగా లాటరీలవలన మద్రాసు ప్రభుత్వానికి 4 కోట్ల రూపాయల ఆదాయం రాగలదని అంచనా వేస్తున్నారు. ఇంతవరకు రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించిన రెండు లాటరీలవలన 1.25 కోట్ల రూపాయలు ఆదాయం వచ్చింది. (యు.ఎన్.ఐ.)

—:o:—

## ఆంధ్ర సారస్వత పరిషత్ విశారద పరీక్షలు

### విజయవాడలో 14, 15 తేదీలలో

విజయవాడ, డిసెంబరు 1 : ఆంధ్రసారస్వత పరిషత్ (హైదరాబాద్) వారి తెలుగు విశారద పరీక్షలు ఈ నెల 14, 15 తేదీలలో కాకరపర్తి భావన్నారాయణ కళాశాలలో జరుగగలవని పరిషత్తు స్థానిక వ్యవస్థాపకులు శ్రీ వి. శ్యామ సుందరదేవ్ తెలియచేస్తున్నారు. పరీక్షకుహాజరు కాదలచినవారు శ్రీ వి. శ్యామ సుందరదేవ్ 'హిందీనికేతన్' పుస్తకమ్మలోట్, విజయవాడ—2వద్దనుండి హాల్ టిక్కెట్లు పొందవచ్చును అని ఆయన ఒక ప్రకటనలో పేర్కొన్నారు

—:o:—

## కంబోడియా నిరసన

టోక్యో, డిశంబర్ 1 : అమెరికా, దక్షిణ వియత్నాం, థాయ్ సాయుధ శకటాలు కంబోడియా భూభాగంలోకి చొచ్చుకు వస్తున్నందుకు కంబోడియా తీవ్ర నిరసన తెలియచేసిందని పెకింగ్ అధికార వార్తాసంస్థ నేడు తెలియజేసింది.

# కటక్‌లో వెయిట్ లిఫ్టింగ్ పోటీలు

### రామకోటేశ్వరరావుకు తృతీయ స్థానం

కటక్, డిసెంబరు 1: ఇక్కడ జరుగుతున్న ఏడవ జూనియర్ వెయిట్ లిఫ్టింగ్ ఛాంపియన్‌షిప్ పోటీలలో లైట్ వెయిట్, మిడిల్ వెయిట్‌లో నేడు రెండు కొత్త జాతీయ రికార్డులు నెలకొల్పబడినవి.

లైట్ వెయిట్‌లో పంజాబ్‌కు చెందిన అవినాష్ చాందర్ 'ప్రెస్'లో 105కిలోల బరువు ఎత్తి కొత్త రికార్డు స్థాపించారు. మొత్తం 315 కిలోల బరువు ఎత్తాడు. రైల్వేలకు చెందిన జి. షిట్ ద్వితీయ స్థానం, ఆంధ్రప్రదేశ్‌కు చెందిన జి. రామకోటేశ్వరరావు తృతీయస్థానం పొందారు. షిట్ 297.5 కిలోలు, రామకోటేశ్వరరావు 292.5 కిలోలు ఎత్తారు.

మిడిల్ వెయిట్‌లో జైసింగ్‌నాయుడు (మధ్యప్రదేశ్, 325కిలోలు) ప్రథమ స్థానం, డి. ఎస్. మూర్తి (ఒరిస్సా, 320) ద్వితీయ స్థానం, శ్యామలాన్ రక్షిత (పశ్చిమ బెంగాల్, 320) తృతీయ స్థానం పొందారు.

—.o.—

## దేశోద్ధారకుని సేవ

(. వ పేజీ తరువాయి)

యన్ భవనాన్ని నిర్మించడానికి దేశోద్ధారకుని పేరు ఉంచడానికి నిర్ణయించి, నిధి సేకరణను అనేక కార్యక్రమాలను సంఘం నిర్వహిస్తోందని ఆయన అన్నారు. అందులో ఈ సంగీతోత్సవం ఒక భాగం అని చెప్పారు.

శ్రీ రాజేశ్వరరావుకు పత్రికా రచయితల సంఘం తరఫున సన్మానం జరిగింది. సన్మానానికి కృతజ్ఞత తెలుపుతూ శ్రీ రాజేశ్వరరావు ఇట్టి సంగీత ఉత్సవాలు రాష్ట్రంలోని ఇతర ముఖ్య నగరముల్లోకూడా జరుగుతూ కళాకారులకు, కళాభిమానులకు మధ్య సన్నిహిత్వం ఏర్పడటం బాగుంటుందని అన్నారు.

"పత్రికా రచయితల సంఘంవారు తమ కార్యక్రమాలకు ఒక భవనం నిర్మింప పూనుకోడం దానికి కళాహృదయుడు సంఘ సంస్కర్త విశ్వదాత అయిన దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారి పేరు పెట్టుకోవాలని నిర్ణయించటం ఎంతైనా సంతోషించదగు విషయమని, ఆయన అన్నారు.

"రాష్ట్రంలో చిత్ర పరిశ్రమం అభివృద్ధికి రాష్ట్రప్రభుత్వం అనేక విధాల సహాయం చేస్తున్నదని, ప్రభుత్వ కృషి ఫలిస్తే త్వరలో కళాకారులంతా హైదరాబాద్‌లో స్థిరపడిపోయి, కళోత్సవాలలో పాల్గొనే సావకాశం ఉంటుందని శ్రీ రాజేశ్వరరావు అన్నారు.

సంగీతోత్సవ సందర్భంగా ప్రచురించిన సావనీర్‌లో అదృష్టం నంబర్ల 'డ్రా'ను శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి నిర్వహించారు. అందులో అదృష్టవంతునిగా 'సినంబర్' పొందిన శ్రీ పి. సత్యనారాయణకు 'మర్ఫీ'సిగరెట్‌కంపెనీ ఇచ్చిన బుష్ బారన్ రేడియోను శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి అందజేశారు.

పత్రికా రచయితల సంఘం కార్యదర్శి శ్రీ కె.వి.ఎం.డి. శ్రీనివాసరావు వందనసమర్పణ చేశారు. సంగీతోత్సవాలు జయప్రదంగా 'జోహార్ జోహార్ వో విశ్వదాతా' గేయ గానంతో సమాప్తమైనాయి.

—:o:—

## తిరుపతిలో కొత్తవిమానాశ్రయం

### కేంద్ర మంత్రికి పి.బి. రాజు విజ్ఞప్తి

న్యూఢిల్లీ, డిసెంబరు 1: తిరుపతిలో కొత్త విమానాశ్రయం నిర్మించటానికి సత్వర చర్యలు తీసుకోవాలని ఆంధ్రప్రదేశ్ రెవిన్యూ మంత్రి శ్రీ పి. బి. రాజు నిన్న కేంద్ర పౌరయాన శాఖా మంత్రికి విజ్ఞప్తి చేశారు.

కేంద్ర మంత్రి డాక్టర్ కరన్‌సింగ్‌తో శ్రీ రాజు నిన్న చర్చలు జరిపారు. హైదరాబాద్, విశాఖపట్నం, విజయవాడ మధ్య రోజూవారీ విమాన సర్వీసు ఏర్పాటు చేయాలని కూడ రాష్ట్ర మంత్రి కోరారు.

## మిర్చి—బెల్లం

(1వ పేజీ తరువాయి)

లకు ఏర్పాటుచేయవలసిన అవసరాన్ని పేర్కొన్నారు.

వ్యవసాయాభివృద్ధికి నూతన విధానాలను రైతులు, వారి సంస్థలే రూపొందించాలిగాని మంత్రులూ, ప్రభుత్వ అధికారులో కాదని అన్నారు.

ఉత్పత్తి పెంచడానికి రైతులకు తగు ప్రోత్సాహం ఇవ్వవలసిన అవసరాన్ని వివరిస్తూ, అది జరిగితే ఆంధ్రప్రదేశ్ ఒక్కటే దేశంలో ప్రత్తి, బియ్యం పప్పుల లోటును తీర్చగలదని శ్రీ తిమ్మారెడ్డి చెప్పారు.

అయితే ఇంజన్ షెడ్లు, హగకు బ్యారన్లు, పశువుల కొట్టాలు మొదలైనవాటి నిర్మాణానికి సిమెంట్‌ను పంపిణీ చేయటంలో ప్రభుత్వానికి సహాయపడవలసినదిగా రైతు పరిషత్తు మంత్రి విజ్ఞప్తి చేశారు.

నిమ్మ, నారింజ, మామిడి మొదలైన పండ్లతో తయారయ్యే వస్తువుల ఉత్పత్తికి ప్రోసెసింగ్ యూనిట్లను నెలకొల్పనున్నట్లు ఆయన చెప్పారు.

# విద్యార్థులకోర్కెలకు అయూబ్ సమ్మతి

### డిగ్రీలను రద్దుచేసే చట్టం రద్దు

కరాచీ, డిసెంబరు 1 : ఆందోళన చేస్తున్న పాకిస్తాన్ విద్యార్థులకు అధ్యక్షుడు శ్రీ అయూబ్‌ఖాన్ నేడు కొన్ని మినహాయింపులను ప్రకటించారు. కాని అదే సమయంలో ఆయన ప్రభుత్వ వ్యవస్థను మార్చాలని కోరే రాజకీయ వ్యతిరేకులను విమర్శించారు.

ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనలు ప్రారంభమై నెలరోజులయింది. ఈ ఆందోళన దేశ వ్యాప్తమైంది కూడా. అప్పటినుంచీ శ్రీ అయూబ్ ఖాన్ ఏమీ ప్రకటన చేయలేదు.

నేడు ఆయన జాతి నుద్దేశించి చేసే మాసాంతపు రేడియో ప్రకటనలో విద్యార్థుల కోర్కెలను తీర్చడానికి తీసుకునే చర్యలను వెల్లడించారు.

గ్రాడ్యుయేట్లకు డిగ్రీలను రద్దుచేసేశాసనాన్ని, విద్యార్థుల రాజకీయ కార్యకలాపాలను నిషేధించే చట్టాన్ని రద్దుచేయగలమని శ్రీ అయూబ్‌ఖాన్ తెలిపారు.

ద్వితీయ శ్రేణి డిగ్రీలను పొందడానికి పాసుమార్కులను తగ్గించడానికి కూడా ఆయన అంగీకరించారు.

పదేళ్ళ క్రితం రక్తపాతం లేకుండా జరిపిన తిరుగుబాటులో అధికారాన్ని స్వీకరించిన అయూబ్‌ఖాన్ తమ ప్రభుత్వాన్ని సమర్థించుకొంటూ, ఎలాంటిమార్పులైనా రాజ్యాంగ బద్ధంగా తీసుకురావలసినదేనని 1970ప్రారంభంలో జరిగే ఎన్నికలలో తమ అభిప్రాయాలను వ్యక్తం చేయడానికి ప్రతిపక్షాలకు పూర్తి స్వేచ్ఛ ఉంటుందనీ అన్నారు.

ప్రభుత్వ వ్యవస్థ మారాలనీ, విప్లవం రావాలనీ నినాదాలు చేసేవారు ఇప్పటి సుస్థిర వ్యవస్థను నాశనం చేసిన తర్వాతవారు కోరే ఆర్థిక, రాజకీయ వ్యవస్థల స్వరూపాన్ని వెల్లడించాలని అయూబ్ అన్నారు. అల్లర్లు, ఆందోళనలవల్ల దేశం నాశనం కావడం తప్ప ఫలితమేమీ ఉండదన్నారు.

—:o:—

## సేనానాయకే

న్యూఢిల్లీ, డిసెంబరు 1: సింహళ ప్రధాని శ్రీ డడ్లీ సేనానాయకే ఇక్కడ తమ నాలుగు రోజుల కార్యక్రమాన్ని ముగించుకొని, పాండిచ్చేరికి నేటి ఉదయం ఇక్కడనుంచి భోపాల్ బయలుదేరి వెళ్లారు.

## సంచార నేతి విక్రయశాల

### విజయవాడలో ప్రారంభోత్సవం

విజయవాడ, డిసెంబరు 1 : పాం ప్రాజెక్టువారి సంచార వాహన నేతి విక్రయశాలను ప్రభుత్వ డిప్యూటీ కార్యదర్శి శ్రీ ఎం. శ్రీరాములు ఈ రోజు ఉదయం ఇక్కడ పాల ప్రాజెక్టు కార్యాలయంలో ప్రారంభోత్సవం చేశారు.

పాల ప్రాజెక్టు నెయ్యి హైదరాబాద్‌లో మొదట్లో అంత అమ్మకం లేకపోయినా ఇప్పుడు బాగా ప్రజల ఆదరణ పొందుతోందని, విజయవాడలో కూడా అమ్మకాలు బాగా ఎక్కువ చేయాలని సూచించారు.

తిరుపతి దేవస్థానంవారు ఈ నేతిని విరివిగా భారీ మొత్తాన కొంటున్నారని, దేవుడికి నేతితో చేయవలసిన హారతి దీపారాధనకోసం కొద్ది కొద్ది మోతాదులలో నెయ్యి చిన్న చిన్న ప్లాస్టిక్ గిన్నెలలో అమ్మితే బాగా అమ్ముడు పోతుంది అని సూచించారు.

అసిస్టెంటు పాల కమిషనర్ శ్రీ డి జయరాం శ్రీ శ్రీరాములుకు స్వాగతం చెప్పి పుష్పమాల సమర్పించారు.

అనంతరం శ్రీ శ్రీరాములు పాల ఫ్యాక్టరీ దర్శించారు. అక్కడ శ్రీ జయరాం ఈ రోజు ప్లాంటు మేనేజరుగా ఛార్జి తీసుకున్నారు. ప్లాంటు ఇంజనీయరు శ్రీ ఎన్. నరసింహాలు ఫ్యాక్టరీలోని వివిధ విభాగాలను వివరించారు.

ఈ సంవత్సరం ఆపరేషన్ ఛార్జీల క్రింద రాష్ట్ర ప్రభుత్వం ఈ ఫ్యాక్టరీకి 1 కోటి 47 లక్షల రూపాయలు మంజూరు చేసినట్లు ఈ సందర్భంలో తెలియచేయబడింది.

## చెరువుకు బలియైన గజరాజు

### కోయంబత్తూరు సమీపాన సంఘటన

కోయంబత్తూరు, డిసెంబరు 1 : ఇక్కడకు అరవై మైళ్ళ దూరంలోగల అన్నామలైస్‌లోని సర్కార్ వన విద్యుచ్ఛక్తి కేంద్రానికి చెందిన చెరువులో గతవారాంతంలో ఒక ఏనుగు పడి మరణించింది.

దాహం తీర్చుకోవడానికి ఆ రిజర్వాయర్ సొరంగం వద్దకు వచ్చిన ఆ ఏనుగు, నీటి ఉరవడికి ఆ సొరంగానికి 70 అడుగులదిగువవున్న చెరువులో పడిపోయింది.

చెరువులోంచి బయటికి రావడానికి 5 రోజులపాటు ఆ ఏనుగు భగీరథ ప్రయత్నం చేసిందని, దానిని రక్షించడానికి అటవీ అధికారులు చేసిన ప్రయత్నాలు కూడా విఫలం కావడంతో చెరువులోనే ఆ ఏనుగు మరణించిందని తెలుస్తున్నది.

నవంబర్ 10 వ తేదీన మరొక అడవి ఏనుగు కూడా ఇవే పరిస్థితులలో మరణించింది.

అడవి జంతువులు ఈ విధంగా మరణించకుండా నిరోధించడం అటవీ శాఖకు ఇప్పుడొక సమస్యగా తయారైంది.

# డి. ఎ. సమస్యపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఒకే విధానం

### జాతీయాభివృద్ధిమండలిరూపొందించాలని మైసూరు ముఖ్యమంత్రి పాటిల్ సూచన

బెంగుళూరు, డిసెంబరు 1 : కేంద్ర రాష్ట్రప్రభుత్వోద్యోగులకు కరువుభత్యం చెల్లింపు విషయంలోను, రాష్ట్రప్రభుత్వాలు తమ వనరులను సమీకరించుకొనడానికి అదనపు పన్నులు విధించే విషయంలోను ఒకే రకమైన విధానాన్ని రూపొందించుకొనే నిమిత్తం జాతీయాభివృద్ధి మండలి సమగ్ర సమావేశం జరగాలని మైసూరు ముఖ్యమంత్రి శ్రీ వీరేంద్రపాటిల్ సూచించారు.

కేంద్రప్రభుత్వం తన సిబ్బందికి పెద్దయెత్తున కరువుభత్యం మంజూరు చేయడంవల్ల రాష్ట్రప్రభుత్వాలకు ఒక విచిత్రమైన సమస్య ఉత్పన్నం కాగా, కొన్ని రాష్ట్రాలు అదనపు పన్నులు విధించడం, లేదా వేస్తున్న పన్నులు రద్దు చేయడంవల్ల రాష్ట్రాల మధ్య రాజకీయంగా అనవసర పరిస్థితి ఏర్పడిందని కూడా ఆయన న్యూఢిల్లీలో జాతీయాభివృద్ధి మండలి స్థాయీ సంఘ సమావేశానికి హాజరై నిన్న ఇక్కడకు తిరిగి వచ్చిన తరువాత తెలియజేశారు.

మైసూరు ప్రభుత్వం తన వనరులను అభివృద్ధి పరచుకోవడానికి ఇటీవల అమ్మకం పన్నును హెచ్చించడాన్ని ప్రస్తావించి, దాని ఫలితంగా అమ్మకంపన్ను తక్కువగా ఉన్న ఇరుగుపొరుగు రాష్ట్రాలతో పోటీ ఏర్పడిందని ఆయన చెప్పారు.

కొన్ని రాష్ట్రప్రభుత్వాలు భూమి శిస్తును రద్దు చేయడం ఇందుకు మరొక ఉదాహరణగా ముఖ్యమంత్రి పేర్కొన్నారు.

రాష్ట్రాలతో సంప్రదించి, ఒకే రకమైన విధానాన్ని రూపొందించడానికి కేంద్రం అంగీకరించినట్లయితే ఇది అన్నికూడా పన్నులాటు కాగలదని ఆయన అన్నారు.

జాతీయాభివృద్ధి మండలి పర్సనేలతో సమావేశమైనప్పుడు పై రెండు అంశాలను పరిశీలించాలని తాను పట్టుపడ చేయగలనని శ్రీ వీరేంద్రపాటిల్ తెలిపారు.

వ్యవసాయ ఆదాయంపై పన్ను విధింపు విషయంలో ప్రణాళికా సంఘం ముఖ్యమంత్రుల అభిప్రాయాలను కోరినట్లుగా వచ్చిన వార్తలను ప్రస్తావిస్తూ ఆ విషయాన్ని ప్రశ్నించగా తన అభిప్రాయాన్ని వెల్లడించ నిరాకరిస్తున్నట్లు శ్రీ పాటిల్ తెలిపారు.

"మైసూరు ప్రభుత్వం ఆహారధాన్యాలపై పన్నువిధించకపోయినా, వాణిజ్య పంటలపై ఇదివరకే పన్ను విధించింది. ఆహారధాన్యాలపై పన్ను విధిస్తే రైతులకు నిరుత్సాహకరంగా ఉండే అవకాశం ఉంది. అది జరిగితే దేశ ధాన్యోత్పత్తి దెబ్బతినే ప్రమాదం ఉంది. ఈ విషయం పరిశీలించవలసి ఉంది" అని ఆయన వివరించారు.

నాలుగవ పంచవర్ష ప్రణాళికా కాలంలో రాష్ట్రాలకు రు. 3500 కోట్ల మేరకు కేంద్ర సహాయం అవసరమయ్యేదని పేర్కొంటూ, కేంద్రం దీనిని నిర్ణయించకముందే మైసూరు ఆక్షేపణ తెల్పిందని శ్రీ పాటిల్ అన్నారు.

నాలుగవ ప్రణాళికకు మొత్తంమీద పెట్టుబడి రు. 4000 కోట్లు రాష్ట్రాలు ఖర్చు చేసేందుకుగాను రు. 1500 కోట్లు సమకూర్చుకోవలసిందని రాష్ట్రాలను కేంద్రం కోరిందనీ, మిగిలిన రు. 2500 కోట్లను కేంద్రం తన వనరుల నుంచి సమకూర్చాలనీ శ్రీ పాటిల్ తెలియజేశారు.

# ఆంధ్ర ప్రాంతం ఖాళీలలో ముల్కీల నియామకం

## రాష్ట్ర స్వతంత్ర పార్టీ కార్యవర్గం సూచన

విజయవాడ, డిసెంబరు 1 : తెలంగాణా ప్రాంతంలో ముల్కీల కోసం కేటాయించిన ఉద్యోగాలలో ముల్కీలుకాని వారిని నియమించినందుకు పరిహారంగా అందుకు సరిపడి సంతగా ఆంధ్రప్రాంతంలో ఏర్పడే ఉద్యోగాల ఖాళీలలో ముల్కీలను నియమించాలని స్వతంత్రపార్టీ అధ్యక్షులు శ్రీ గౌతు లచ్చన్న నిన్న యిక్కడ పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో సూచించారు.

ప్రస్తుతం చెలరేగుతున్న ఆంధ్ర, తెలంగాణా వైషమ్యాలను అంతమొందించటానికి యిది ఒక్కటే మార్గమని, ముఖ్యమంత్రి యీ సూచనను అంగీకరించాలని ఆయన విజ్ఞప్తి చేశారు.

ప్రసంగంలో శ్రీ లచ్చన్న శ్రీ వి. రామకృష్ణ మరణానికి సంతాపం ప్రకటించారు.

ఆంధ్రప్రదేశ్ స్వతంత్రపార్టీ కార్యవర్గం నిన్న యిక్కడ పార్టీ కార్యాలయంలో శ్రీ లచ్చన్న అధ్యక్షతన సమావేశమై, డిసెంబరు 8 వ శ్రీ రాజాజీ 91 వ జన్మదినోత్సవానికి అభినందనలు అందజేస్తూ స్వతంత్రోద్యమాన్ని నడపటానికి, పర్మిట్—లైసెన్సు— కోటా రాజ్యాన్ని అంతమొందించటానికి ఆయనకు యింకా చాలాకాలం బలం, ఆయుస్సు, ఆరోగ్యం భగవంతుడు ప్రసాదించాలని కోరుతూ తీర్మానించారు.

చెరుకుధర టన్నుకు 100 రూపాయలు నిర్ణయించినందుకు సంతోషం ప్రకటిస్తూ, పంచదారమిల్లర్లను అంగీకరింపజేయలేనందుకు విచారం ప్రకటించారు.

ఆహారధాన్యాల ధరల నిర్ణయంలో వ్యవసాయ ఖర్చు పెరుగుదల, భూమిశిస్తు పెంపు మొదలగునవి పరిగణనలోకి తీసుకోకపోవటం పట్ల విచారం ప్రకటించి, రైతులు అధికోత్పత్తి సాధించటానికి ప్రోత్సాహంగా అంతర్జాతీయధర యివ్వాలని మరో తీర్మానంలో పేర్కొన్నారు.

గవర్నరు ప్రసంగానికి అసెంబ్లీలో ముఖ్యమంత్రి చేసిన కృతజ్ఞతా ప్రసంగంలో శ్రీకాకుళం, నల్గొండ, ఖమ్మం జిల్లాలలో రాజద్రోహులు ప్రభుత్వాన్ని పడద్రోసి రాష్ట్రంలో అల్లకల్లోల పరిస్థితులను సృష్టించటానికి చేస్తున్న ప్రయత్నాన్ని మొదట్లోనే అరికట్టటానికి ఏమిచర్యలు తీసుకుంటున్నారో వివరించకపోవటంపట్ల విచారం ప్రకటిస్తూ, యివి అక్కడక్కడ విడివిడిగా జరుగుతున్న సంఘటనలే అయినా, అంతా ఒకే పన్నాగంలో భాగమని, అందువల్ల ఆదిలోనే అంతమొందించాలని, లేకపోతే తీవ్ర ప్రమాదానికి దారితీస్తుందని హెచ్చరిస్తూ మరో తీర్మానం చేశారు.

నూతన జిల్లాలు ఏర్పాటు చేయటం విషయంలో ఆ జిల్లాలలోని అన్నిపార్టీల, స్థానిక సంస్థల అభిప్రాయాన్ని తెలుసుకొని నూతన జిల్లాలలో ఏ ఏ ప్రాంతాలు చేరాలో నిర్ణయించాలని ఆయన సూచించారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత జిల్లాలు ఒక క్రమపద్ధతిమీద విభజింపబడలేదని అభిప్రాయం వ్యక్తంచేసి యిప్పుడైనా ఆ విధంగా జిల్లాల పునర్వ్యవస్థీకరణ జరగటం అవసరం అని సూచించారు.

చిరకాలంనుంచో ప్రజలు ఆందోళన చేస్తున్న జిల్లా విజయనగరం కేంద్రంగా ఏర్పడాలని ఆయన సూచించారు.

శ్రీకాకుళంజిల్లాలో తుఫాను బీభత్సం వల్ల కలిగిన ఆపారనష్టం గురించి నవంబరు 25 వరకు కేంద్రప్రభుత్వానికి రాష్ట్రప్రభుత్వాన్నుండి రిపోర్టు అందనట్లు ఉపప్రధాని శ్రీ మొరార్జీ దేశాయ్ శ్రీ ఎన్. జి. రంగాకు వ్రాసిన లేఖవల్ల బుజువైపోయిందని, దీన్నిబట్టి ప్రభుత్వం తుఫానుబాధితుల పట్ల ఎంత నిర్లక్ష్యవైఖరి ప్రదర్శిస్తున్నదో అర్థమవటమేకాక రాష్ట్రమంత్రి రిపోర్టు యిదివరకే పంపబడిందని ప్రజలను మభ్యపెట్టటం కూడా జరిగిందని ఆయన వివరించారు.

---

# ఆంధ్ర ప్రాంతంలో వ్యవసాయ విశ్వవిద్యాలయం

## విద్యార్థి కాంగ్రెస్ అధ్యక్షుని ప్రకటన

విజయవాడ, డిసెంబరు 1 : ఆంధ్ర విశ్వవిద్యాలయ పరిధిలో ముఖ్యంగా వ్యవసాయం బాగా అభివృద్ధి చెందిన ప్రాంతంలో ఒక వ్యవసాయ విశ్వవిద్యాలయం ఏర్పడటం అవసరం అని, యీ విషయాన్ని డిసెంబరు 1, 2 తేదీలలో గుంటూరులో జరుగనున్న విద్యార్థి కాంగ్రెస్ మహాసభలో తీర్మానించనున్నట్లు నిన్న యిక్కడ సిటీకాంగ్రెసు కార్యాలయంలో ఆంధ్ర విద్యార్థి కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ పి. వెంకటరావు పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ప్రకటించారు.

రోజురోజుకు నిరుద్యోగం పెరుగుతున్న యీ రోజులలో విద్య స్వతంత్రమైన వృత్తి చేపట్టి జీవితం గడుపుకోటానికి తోడ్పడేదిగా వుండాలని ఆయన సూచించారు. పనిచేసుకుంటూ చదువుకోటానికి అవకాశాలు కల్పించాలని, తరచు విద్యావిధానాలు, రెగ్యులేషన్లు మార్చటం సమంజసం కాదని యీ విషయాలన్నీ విద్యార్థికాంగ్రెస్ మహాసభలో క్షుణ్ణంగా చర్చింపబడతాయని వివరం చేశారు.

సమ్మెల గురించి విద్యార్థికాంగ్రెస్ వైఖరి ఏమిటి అని ప్రశ్నించగా, సమ్మె ఏ సమస్యను కూడా పరిష్కరించలేదని, సంప్రదింపుల ద్వారానే సమస్యలు పరిష్కారం కాగలవని తమ విశ్వాసాన్ని ప్రకటించారు.

విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్న మరీన్ ఇంజనీరింగ్ డిగ్రీని ప్రభుత్వం గుర్తించకపోవటం విచారకరమని, అందువల్ల వెంటనే గుర్తించి అనేకమంది అర్హతగల యువకులకు ఉద్యోగ అవకాశాలు కల్పించవలసిందిగా ఆయన విజ్ఞప్తి చేశారు.

ఉద్యోగాలకు ఎక్కువ అవకాశాలుండే పరిశ్రమలు ఆంధ్రదేశంలో స్థాపించి, ఆంధ్రులకే అందులో ఉద్యోగ అవకాశాలు కల్పించాలని, యిప్పుడు రామచంద్రపురం హెవీ ఎలెక్ట్రికల్స్ మొదలగు సంస్థలలో లోవర్ ఉద్యోగంనుండి పబ్లిక్ సర్వీస్ కమిషన్ నియామకం చేసి, పై తరగతి ఉద్యోగాలలో చాలామంది ఆంధ్రేతరులున్నారని స్పష్టం చేశారు.

---

# రాజకోటలో మొరార్జీ సభకు అంతరాయం

## విద్యార్థుల అల్లరి ఫలితం

రాజకోట, డిసెంబరు 1 : స్కూళ్లలో ఫీజు హెచ్చించినందుకు ఆందోళన చేస్తున్న విద్యార్థులు నిన్న ఇక్కడ ఉపప్రధాని మొరార్జీ దేశాయ్ మాట్లాడవలసిన బహిరంగ సభలో హేళనగా కేకలు వేస్తూ, నినాదాలుచేసి, బహిరంగసభ సాగకుండా చెదిరి పోయేటట్లు చేశారు.

వేదికపైకి విద్యార్థులు రాళ్లుకూడా విసిరారు. అల్లరి చేసినవారిలో ఎక్కువమంది ఆడపిల్లలు.

మహాత్మాగాంధి నెలకొల్పిన రాష్ట్రీయ శాల ఆవరణలో గాంధి శతజయంతి సందర్భంగా ఏర్పాటైన బహిరంగసభలో శ్రీ దేశాయ్ మాట్లాడుతూ ఉండగా, 10 నిముషాలు ఆయన మాట్లాడాక తర్వాత విద్యార్థుల అల్లరి ప్రారంభం అయింది.

గాంధి శతజయంతి ప్రాముఖ్యం వివరిస్తూ, శ్రీ దేశాయ్ ఆ రాష్ట్రంలో ఫీజు పెంపుదలకు విద్యార్థులు చేస్తున్న ఆందోళన గురించి ప్రస్తావించారు. ఫీజు పెంపుదల న్యాయమో, అన్యాయమో చెప్పదలచ లేదని ఉపప్రధాని పేర్కొనగానే వేదికకు 10 గజాల దూరంలో ఉన్న ఒక విద్యార్థి శ్రీ దేశాయ్‌ని ఉద్దేశించి ఏదో అనటంతో మిగిలినవారంతా హేళన, నినాదాలు సాగించారు.

గుజరాత్ ఆర్థికమంత్రి శ్రీ బల్వంత్ మెహతా, ఇతర స్థానిక నాయకులు విద్యార్థులను ప్రశాంతపరచుటకు చేసిన ప్రయత్నాలన్నీ వృథా అయినవి. అరగంట దాకా "నినాదాల గానం" సాగింది.

కేంద్ర విద్యా సహాయ మంత్రి భగవత్ ఝా ఆజాద్, కేంద్ర కార్మిక ఉపమంత్రి శ్రీ కురేషి, ఖాదీ బోర్డు అధ్యక్షులు శ్రీ ఢేబర్ లతోపాటు వేదికపై శ్రీ దేశాయ్ నిశ్చలంగా కూర్చుండిపోయారు. వాళ్లు వివరబడటంతో దక్షిణాబటగోడుగా నీపుకునిగాడింది

---



మంగారు గాజాలు శతయనోత్సవ సందర్భమున విజయవాడలో జరిగిన సభలో ఎ. ప్రతినిధ్యాలు ... అమ్మారెడ్డి కృష్ణమూర్తి ప్రసంగించినప్పటి పొటో

---

# భారత్-రష్యా మైత్రి పటిష్ఠత

## ఇస్కస్ మహాసభలో ప్రముఖుల ప్రసంగం

రాజమండ్రి, డిసెంబర్ 1 : ఆంధ్రప్రదేశ్ ఇస్కస్ (భారత్, రష్యా సాంస్కృతిక సంఘం) మహాసభలు నిన్న సాయంకాలం ఇక్కడ పురపాలక సంఘం హాలులో డాక్టర్ వి. వి. తిలక్ అధ్యక్షతన ప్రారంభమైనాయి.

శ్రీ కొవారి ఓవామహేశ్వరరావు మైత్రి గేయం పాడారు. రాజమండ్రి పురపాలక సంఘం అధ్యక్షుడు, ఆహ్వాన సంఘాధ్యక్షుడు అయిన శ్రీ పోలంరి వీరభద్రరావు స్వాగతం పలుకుతూ, ప్రపంచశాంతికోసం మానవుల అభివృద్ధికోసం రష్యాతో మైత్రిని పటిష్ఠం చేసుకోవాలన్నారు.

ఆంధ్రప్రదేశ్ లలితకళా ఎకాడమీ కార్యదర్శి శ్రీ ఎల్. ఎన్. గుప్త సభలను ప్రారంభిస్తూ, ఉభయదేశాలమధ్య మైత్రిసాధనకు నిర్విరామంగా కృషిచేసిన రష్యా, భారత్ నాయకులకు జోహార్లర్పించారు.

అమెరికా, రష్యాలు మనకు అందజేస్తున్న సహాయంలో చాలా తేడా వున్నదని, మనం అన్నిరంగాలలో స్వయంసమృద్ధం అయ్యేలా చూడడం రష్యా ఆశయమని ఆయన అన్నారు. ఆంధ్రలో దిగువసీలేరువంటి పథకాలకు రష్యా సహాయం లభిస్తుందని చెప్పారు.

ఇస్కస్ ఆంధ్రశాఖ కార్యదర్శి శ్రీ కొల్లి రామకోటేశ్వరరావు ఉపరాష్ట్రపతి వి. వి. గిరి, ప్రధాని ఇందిరాగాంధి, కేంద్రమంత్రి శ్రీ కె. ఎల్. రావు, కేరళముఖ్యమంత్రి శ్రీ నంబూద్రిపాద్ ప్రభృతుల దగ్గరనుంచి వచ్చిన శుభాకాంక్ష సందేశాలను చదివారు. ఢిల్లీలోని రష్యా సాంస్కృతిక విభాగం అధిపతి డాక్టర్ డానిలో, ఉస్మానియా విశ్వవిద్యాలయం సాంస్కృతిక విభాగానికి చెందిన శ్రీ వి. ఐ. రోమెష్కిన్, ఇంగ్లీషులోను, శ్రీమతి సరోజినీ ఉర్దూలోను మాట్లాడారు.

శ్రీ కె. రామకోటేశ్వరరావు కార్యదర్శి నివేదిక సమర్పించారు.

నిన్న ఉదయం భారత, రష్యాజాతీయపతాకాలను శ్రీ క్రొవ్విడి లింగరాజు, డాక్టర్ ఎ. వి. నాగేశ్వరరావు ఆవిష్కరించారు.

శ్రీ ఎం. రాజాజీ, శ్రీ ఎ. వెంకటేశ్వరరావులు నిర్వహించిన చిత్రకళా పోటోల ప్రదర్శనానికి శ్రీ టి. బుల్లయ్య ప్రారంభోత్సవం చేశారు. (స్వ. వి)

### ధన్వంతరి జయంతి

మేడికొండూరు, డిసెంబరు 1 : స్థానిక వైద్యులు డా. కొర్నిపరి పాండురంగారావు వసతి గృహమందు "శ్రీ ధన్వంతరి జయంతి" జరిగింది. తరువాత తీర్థ, ప్రసాదములు పంచిపెట్టారు. ఈ కార్యక్రమాన్ని శ్రీ కూరపాటి భీమేశ్వరశర్మ నిర్వహించారు.

---

# రైతులకు వాణిజ్య బ్యాంకుల పరపతి

## —మొరార్జీ సూచన

హైదరాబాదు, డిసెంబర్ 1 : ప్రస్తుతం వ్యవసాయ రంగంలో జరుగుతున్న విప్లవాన్ని పూర్తిగా విజయవంతం చేయటానికై చిన్నతరహా వ్యవసాయదారులకు సహాయం చేసేందుకు వాణిజ్య బ్యాంకులు గ్రామీణ ప్రాంతాలలో ఉపకార్యాలయాలు తెరవాలని ఉపప్రధాని శ్రీ మొరార్జీదేశాయ్ నిన్న కోరారు.

కొత్తగా ఏర్పాటు చేసిన వ్యవసాయ సహాయ సంస్థను ప్రారంభోత్సవం చేసిన తరువాత శ్రీ మొరార్జీదేశాయ్ ప్రసంగిస్తూ, వ్యవసాయదారులకు యిప్పుడు యిస్తున్న ఋణం కంటే హెచ్చు మొత్తాలను వాణిజ్య బ్యాంకులు యివ్వాలని కోరారు. శాస్త్రీయ వ్యవసాయాభివృద్ధికై సహకరించే వాణిజ్య బ్యాంకులు యీ సంస్థను ఏర్పాటు చేశాయి.

నమ్మకస్తులని తోచిన వెంటనే చిన్న తరహా రైతులకు బ్యాంకులు ఋణం యివ్వాలి. చిన్నతరహా రైతులను సహకార సంఘాలుగా ఏర్పాటు చేయటంలో కూడా బ్యాంకులు ఎంతో తోడ్పడవచ్చును అని ఉపప్రధాని అన్నారు.

వాణిజ్య బ్యాంకులు వ్యవసాయ రంగంలో ఋణసహాయం చేయటంలో ఎదుర్కొన వలసివస్తున్న అడ్డంకులను తొలగించగలమని కూడా శ్రీ దేశాయ్ హామీ యిచ్చారు.

బ్యాంకు డైరెక్టరు ఏదేనా వాణిజ్య సంస్థలో డైరెక్టరుగా వుంటే, ఆ వాణిజ్య సంస్థకు యీ బ్యాంకు అప్పు మంజూరు చేయటంపై ఆంక్ష విధిస్తున్న నిబంధనను సవరించాలన్న సూచనను తాము పరిశీలించగలమని శ్రీ దేశాయ్ హామీ యిచ్చారు.

సంస్థ అధ్యక్షుడు శ్రీ ఎస్. ఎం. చోక్సి స్వాగతోపన్యాసం యిస్తూ పై నిబంధనవలన యీ సంస్థ కార్యకలాపాలకు ప్రతిబంధకంగా వున్నదని అన్నారు. (యు. ఎన్. ఐ.)

---

# మద్రాసులో పరీక్ష రుసుములు

మద్రాసు, డిసెంబర్ 1 : ప్రస్తుత విద్యా సంవత్సరంలో పరీక్షకు రుసుము హెచ్చించరాదని మద్రాసు విశ్వవిద్యాలయం సిండికేట్ నిన్న నిర్ణయించింది.

పరీక్షకు రుసుమును పెంచాలని కొంత కాలం క్రితం చేసిన నిర్ణయానికి నిరసనగా విద్యార్థులు ప్రదర్శనలు జరిపారు.

దీనిపై సిండికేట్ నిన్న విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు డాక్టర్ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్ అధ్యక్షతన సమావేశమై విద్యార్థుల కోర్కెలను పరిశీలించి రుసుము పెంచరాదని తీర్మానించింది.

---

# అలహాబాద్‌లో విద్యార్థుల అల్లర్లు

## దుకాణాలు, గృహాలపై రాళ్ళవర్షం

అలహాబాద్, డిసెంబర్ 1 : కోహ్రదిక్కులైన అగర్వాల్ కళాశాల విద్యార్థులు సుమారు 500 మంది నిన్న మధ్యాహ్నం, జీరో రోడ్డు క్రాసింగ్‌లో దుకాణాలు, గృహాలపైన అరగంటసేపు విచ్చలవిడిగా రాళ్ల వర్షం కురిపిస్తూ, అల్లకల్లోలం సృష్టించారు.

దుకాణదారులు తమ దుకాణాలు వెంటనే మూసివేశారు. విద్యార్థులు రెండు ప్రభుత్వ రవాణా బస్సులపైనకూడా రాళ్లు విసిరారు.

సాయుధ పోలీసులు ఆ స్థలానికి చేరుకోవటంతో అల్లరి సాగించే విద్యార్థులు అక్కడినుంచి వెళ్లాచెదరై నిష్క్రమించారు.

ఈ సందర్భంగా ఆరుగురు విద్యార్థులను నిర్బంధంలోకి తీసుకున్నారు.

---

# స్వావలంబన సాధనలో విశాఖపట్టణం రేవు ప్రగతి

## రైలు-రోడ్డు వంతెనలను ప్రారంభిస్తూ కేంద్ర మంత్రి వి. కె. ఆర్. వి. రావు ప్రకటన

(స్వకీయ విలేఖరి)

విశాఖపట్నం, డిసెంబర్ 1 : 1930 ప్రాంతంలో నష్టంతో నడుస్తున్న విశాఖ రేవు ఈనాడు గణనీయంగా లాభాలను గడిస్తున్నదని, రేవు అభివృద్ధి కార్యక్రమాలకు పెట్టుబడిపెట్టే విషయంలో స్వావలంబనం చేకూరడం రేవు నిర్వాహకులు గర్వపడదగిన విషయమని కేంద్ర రవాణా, నౌకా వాణిజ్యశాఖామంత్రి డాక్టర్ వి. కె. ఆర్. వి. రావు నిన్నిక్కడ అన్నారు.

విశాఖరేవు ప్రాంతంలో రైలు—రోడ్డు వంతెనలను డాక్టర్ రావు నిన్న ప్రారంభోత్సవం చేస్తూ, రేవులో అభివృద్ధి కార్యకలాపాలను తీవ్రతరం చేయడానికి ఈ వంతెన ఎంతో అధికంగా దోహదం చేయగలదని అన్నారు.

ఇప్పుడు నెలకొనివున్న, ఇకముందు నెలకొల్పబోయే పరిశ్రమల రవాణా అవసరాలను తీర్చడానికి రేవు తూర్పుప్రాంతానికి త్వరితగతిని, తక్కువ ఖర్చుతో సరకులను మొదలయినవాటిని చేరవేయడానికి నౌకా విస్తరణ అవసరాలను తీర్చడానికి యీ వంతెన ఉపయోగపడగలదన్నారు.

రేవులో రద్దీ 1973—74 నాటికి అంచనా వేసిన 1.25 కోట్ల టన్నులకు మించి పోవచ్చునని అనిపిస్తున్నట్లు ఆయన చెప్పారు. దీనిమూలంగా రేవును మరింత అభివృద్ధి పరచవలసివున్న దన్నారు.

మొదట మూడువేలు, తరువాత 150 వేల టన్నుల వాహకశక్తిగల నౌకలు వచ్చి పోవడానికి అనువుగా 31 కోట్ల రూపాయలు ఖర్చుతో నిర్మించదలచిన ఔటర్ హార్బర్‌ను గురించి ఆయన ప్రస్తావించారు. ఇందుకు సంబంధించిన పథకాన్ని సూత్రప్రాయంగా ఆమోదించడం జరిగిం దన్నారు. సమగ్రమైన ప్రాజెక్టు నివేదిక తయారీకి సలహాదార్లను నియమించ నున్నారు.

సముద్రపుకోతను గురించి డాక్టర్ రావు ప్రస్తావిస్తూ, బీచి ఉత్తరపు ప్రాంతంలో సంభవిస్తున్న ఈ కోత అందరికీ ఆందోళన కల్గిస్తున్న దన్నారు. పోర్టుట్రస్టువారు ఒక డ్రెడ్జర్‌ను సంపాదించారని, దాని సాయంతో ఏటేటాడవునా ఇసుకను బీచిలో నింపగలరన డంలో సందేహం లేదని ఆయన అన్నారు. అయితే యింతమాత్రాన సముద్రపుకోత నివారణ కాదని తాను గ్రహించానని, అవసరమైన బండరాళ్లను అక్కడ పేర్చి, రాష్ట్ర ప్రభుత్వంవారు చప్టావని చేయించాలని ఆయన సూచించారు. రివెటుమెంట్ నిర్మాణానికి రాష్ట్రప్రభుత్వం సత్వరచర్యలు తీసుకున్నట్లయితే కోతసమస్య సంతృప్తికరంగా పరిష్కారం అవుతుం దన్నారు. ఔటర్ హార్బర్ నిర్మాణంతో సమస్యకు శాశ్వత పరిష్కారం జరుగుతుం దన్నారు.

హిందుస్థాన్ నౌకానిర్మాణ కేంద్రాన్ని గురించి మాట్లాడుతూ, సాలుకు ఆరు నౌకల నిర్మాణానికి వీలుగా సంస్థ స్తోమతును పెంచేందుకు పదికోట్ల రూపాయల ఖర్చుకాగల పథకాన్ని సాయ్ సంఘం సిఫారసు చేసిందని, ఈ పథకం తమ మంత్రిత్వశాఖ పరిశీలనలో వున్నదని, నాల్గవ ప్రణాళికలో చేర్చదలిచామని ఆయన అన్నారు. ఇదిలా వుండగా, నౌకా నిర్మాణ కేంద్రాన్ని ఆధునికీకరణ చేయడానికి చర్యలు తీసుకొన్నామన్నారు.

### ముఖ్యమంత్రి ప్రసంగం

సభాధ్యక్షత వహించిన ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి తమ అధ్యక్ష ప్రసంగంలో ఆంధ్రప్రదేశ్ ప్రస్తుతం ఆర్థికంగా మెరుగైన స్థితిలో లేదని పేర్కొన్నారు.

సముద్రపు కోత నివారణకు విశాఖపట్నం రేవుకు డబ్బు ఖర్చు చేయటంలో కొన్ని న్యాయసంబంధమైన చిక్కులు ఉన్నట్లు తమకు తెలియచేయబడినదనీ, ఈ కార్యక్రమానికి రాష్ట్రప్రభుత్వం ఇప్పటికే రు. 4 లక్షలు వ్యయం చేసినదనీ, అందుచే సముద్రపుకోత నివారణకు మిగతా పనులను విశాఖ పోర్టుట్రస్టు చేపట్టాలని కోరుతున్నామని, ఆ తర్వాత వ్యయానికి సంబంధించిన ఏమయినా న్యాయరీత్యా చిక్కులు వచ్చేట్లయితే, పోర్టుట్రస్టు పెట్టిన ఖర్చును తిరిగి చెల్లించుటకు తాము సిద్ధంగా ఉండగలమని ముఖ్యమంత్రి వివరించారు.

విశాఖలో రెండవ ఎరువుల కర్మాగారం 1970 నాటికి ఉత్పత్తి ప్రారంభించాలని సంకల్పింపబడినందున, త్వరలో ఒక స్థలం అందజేయబడుటకు పోర్టు అధికారులు, రక్షణ అధికారులు తోడ్పడాలని ముఖ్యమంత్రి విజ్ఞప్తి చేశారు. విశాఖలో ఇతర పరిశ్రమలకు స్థలం ఇవ్వగల్గుటకు వీలుగా స్థలాన్ని పొదుపుగా వాడుకోవలసిందిగా పోర్టుట్రస్టుకు, రక్షణ అధికారులకు ఆయన సూచించారు.

నౌకా నిర్మాణ కేంద్రం గురించి ప్రస్తావించి, ఏడాదికి ఈ కేంద్రం కనీసపక్షం 6 నౌకలయినా నిర్మించకపోతే, ఈ మొత్తం ప్రాజెక్టు అంతా వృథా అని పరిగణించవలసి వస్తుందనీ, అందుచే నౌకానిర్మాణ కేంద్రం కార్మికులు ప్రయోజనకరమైన వైఖరి పెంపొందించుకోవాలనీ ముఖ్యమంత్రి ఉద్బోధించారు.

పొరుగు రాష్ట్రాలతో పోల్చి చూస్తే ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికంగా బాగా వెనుక పడినట్లు తెలుస్తుందనీ, అందుకే ఇక్కడ పరిశ్రమలు బాగాఅభివృద్ధి చెందేటట్లు అందరూ కృషిచేయాలనీ ఆయన అన్నారు.

నీటి సమస్యను ప్రస్తావించి, రు. 3 కోట్లు ఖర్చు కాగల మేఘాద్రిగడ్డ రిజర్వాయరు పథకం మంజూరు చేయటంతో పాటు, విశాఖకు గోదావరి జలాల మళ్లింపు విషయంకూడా ఆలోచించబడుతున్నదనిఅన్నారు. త్వరలో ఇందుకు రెండు ప్రత్యేక డివిజన్లు ఏర్పాటు చేయటం జరుగుతుందని చెప్పారు. ఈ కార్యక్రమం నాల్గవ ప్రణాళికలో చేర్చబడగలదనీ, పని తప్పక జరుగుతుందనీ, ఆయన అన్నారు.

విద్యుచ్ఛక్తి గురించి ప్రస్తావించి, దిగువ సీలేరు ప్రాజెక్టు నాల్గవ ప్రణాళికా కాలంలో పూర్తి కాగలదనీ, ప్రభుత్వము దానిపై ఇప్పటికే పెద్ద మొత్తాలు ఖర్చు చేసినదనీ చెప్పారు.

ఆంధ్ర ఆర్థిక వ్యవస్థ కుంటుపడకుండా చేయడానికి అందరూ సహకరించాలనీ, అన్నింటికంటే పారిశ్రామిక శాంతి అత్యవసరమైనదనీ, అన్నారు. రాష్ట్రంలో, ప్రభుత్వ, ప్రయివేటురంగాలు రెండింటిలో పందొమ్మిది కోట్లు పెట్టుబడి పెట్టబడుతోందనీ, ఈ పరిశ్రమలు అభివృద్ధి చెందుటకు తగిన పరిస్థితులు ఏర్పాటు చేయాలనీ అన్నారు.

కేంద్ర నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖ మంత్రి డాక్టర్ కె.ఎల్. రావుకూడా సభకు హాజరైనారు.

---

# హుస్సేనీవాలా వద్ద పాకిస్తానీ చౌకీ

## — నిబంధనలు ఉల్లంఘించి ఏర్పాటు

ఫిరోజపూర్, డిసెంబరు 1 : హుస్సేనీవాలా ప్రాంతంలోని భారత్, పాక్ సరిహద్దులో పాకిస్తాన్ 150 అడుగుల దూరంలోపల భూప్రాంతానికి సంబంధించిన నిబంధనలు ఉల్లంఘించి ఒక చౌకీని ఏర్పాటు చేసినట్లు నిన్న ఇక్కడ అధికారయుతంగా తెలియవచ్చింది.

పాకిస్తాన్ ఏర్పాటు చేసిన ఈకొత్త పికెట్ నిన్న భారతీయ పత్రికా విలేఖరుల బృందానికి చూపించబడింది.

భారతీయ సరిహద్దు భద్రతాదళ యీ విషయం గురించి పాకిస్తాన్ సరిహద్దు భద్రతాదళం అధికారులకు ఫిర్యాదు చేసినట్లు విలేఖరులకు తెలియజేయబడింది.

### అపహరణ

గత 11 నెలల్లోను పాకిస్తానీ అక్రమ ప్రవేశకులు, భారత్—పాకిస్తాన్ తూర్పు సరిహద్దులో (అస్సాం—తూర్పు పాకిస్తాన్ సరిహద్దులో) 17 మంది భారత జాతీయులను ఎత్తుకుపోవటం 215 పశువులను తోలుకొని పోవటం జరిగింది.

సరిహద్దు భద్రతాదళాల తృతీయ వార్షికోత్సవం సందర్భంగా నిన్న షిల్లాంగ్‌లో బ్రిగేడియర్ ఎమ్. ఎల్. బారువా ఒక ప్రకటనచేస్తూ ఈ 11 నెలల్లోను తూర్పుపాకిస్తాన్ రైఫిల్ దళంవారు మూడుసార్లు అస్సాంలోకి అక్రమంగా ప్రవేశించారనీ, మూడు పౌర్యచర్యలు జరిపారనీ తెలియజేశారు.

పాకిస్తానీ నేరస్థులు కూడా అస్సాంలోకి 14 సార్లు అక్రమంగా ప్రవేశించి 15 దొంగతనాలు జరిపారని కూడా తెలియజేయబడింది.

---

# 'ప్రణాళికా సంక్షోభం'

## నంబూద్రిపాద్ వివరణ

న్యూఢిల్లీ, డిసెంబర్ 1 : ప్రణాళికను రూపొందించుటకు అనుసరిస్తున్న పద్ధతి తీవ్ర సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నదని కేరళ ముఖ్యమంత్రి శ్రీ నంబూద్రిపాద్ అన్నారు.

ఇందుకు గల అనేక కారణాలలో కేంద్రం రాష్ట్రాలకు ఏమి సంతరించుకోగల వనరుల విషయంలో నిశ్చిత స్థితిలేదు అని శ్రీ నంబూద్రిపాద్ పేర్కొన్నారు. పైగా ఎంత విదేశీమారక ద్రవ్యం సమకూరుతుందో కూడా తెలియదు. వీటన్నింటికన్నా ముఖ్యంగ ధరల స్థాయి పట్టశక్యంగాని తీరుగా ఉన్నదని శ్రీ నంబూద్రిపాద్ వ్యాఖ్యానించారు.

---

చండీఘర్, డిసెంబర్ 1 : అవుషధాల ఉత్పత్తిని అధికం చేసి, వాటిని తక్కువ ధరలకు ప్రజలకు అందజేయాలని ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి నిన్నఇక్కడ సూచించారు.

---



---

# ఐకమత్యంగా పనిచేస్తేనే మధ్యంతరఎన్నికల్లో విజయం

## పంజాబ్ పార్టీకి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి హెచ్చరిక

చండీఘర్, డిసెంబర్ 1 : మధ్యంతర ఎన్నికలలో కాంగ్రెసువారంతా ఒక్క మనిషిగా కలిసికట్టుగా పనిచేసినట్లయితే పంజాబ్ ఎన్నికలలో కాంగ్రెసు ఘన విజయం సాధించగలదని ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి నిన్న ఇక్కడ కాంగ్రెస్ కార్యకర్తల సమావేశంలో ఉద్ఘాటించారు.

కాంగ్రెసుపార్టీలోని అత్యుత్తము సేవకులైనవారినే ఎన్నుకుంటుందని, కొన్ని సందర్భాల్లో ఇట్టిది జరుగకపోయినా కాంగ్రెసువారంతా కలసి కట్టుగా తీవ్రంగా కృషిచేసి అభ్యర్థులందరూ గెలిచేలా పనిచేయాలని ప్రధాని శ్రీమతి గాంధి విజ్ఞప్తి చేశారు.

నిన్న మధ్యాహ్నం శ్రీమతి గాంధీ ఇక్కడకు వచ్చారు. విమానాశ్రయంలో ఆమెకు గవర్నర్, ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు, ముఖ్యమంత్రి ప్రభృతులు స్వాగతం ఇచ్చారు. ఆమె విమానాశ్రయంనుంచి నేరుగా క్రికెట్ స్టేడియంలోకి పోయి అక్కడి సభలో ప్రసంగించారు.

దేశంలో పలు ప్రాంతాలలో నెలకొన్న సంఘటనల ప్రభుత్వాలు విఫలమైనాయని, ఒక్క కాంగ్రెసుపార్టీయే దేశాన్ని ఈ తరుణంలో ఆదుకోగలదని, కాంగ్రెసుకుగల అత్యున్నత స్థానం తిరిగిపొందాలి అంటే, పార్టీలోని విభేదాలు, మాత్సర్యాలు తొలగిపోయి తీరాలని ఆమె హెచ్చరించారు.

గడచిన మూడు సంవత్సరాలు దేశానికి చాలా గడ్డుగా గడిచాయి. పాకిస్తాన్ సైన్యం ఒక వేపు, పలు ప్రాంతాలలో కాటకం దేశాన్ని పీడించాయి. కాని ఏదో విధంగా దేశం ఈ ఇక్కట్లను దాటి గట్టెక్కింది, అయినా చేయవలసింది ఇంకా ఉంది

(మిగతా 8వ కాలంలో)

(5 వ కాలం తరువాయి)

అని శ్రీమతి గాంధి వివరించారు.

ప్రగతికి మనం ఎంచుకున్న మార్గం అత్యంత క్లిష్టతరమైనదేగాని గత్యంతరం లేదు. అదే మంచి మార్గం అని శ్రీమతి గాంధి అంటూ, కాంగ్రెసు నాయకత్వం క్రింద దేశం చాలా కష్టాలను దాటింది. ఎన్నో మైలు రాళ్లను సాధించింది అని ప్రధాని పేర్కొని, అయితే కొన్ని తప్పులుకూడా లేక పోలేదు అన్నారు.

పోయినసారి ఎన్నికలలోని పరాజయాలను ప్రస్తావించి, ఇది కాంగ్రెసువారికి ఒక గుణపాఠమని, దీనివల్ల ప్రయోజనం పొందాలని ఆమె చెప్పారు.

పంజాబ్ ప్రజలు కాంగ్రెసును ఘనంగా తిరిగి విజయప్రసాదాలనిచటం ఎక్కించాలి అంటే, అంతకు ముందు కాంగ్రెస్‌వారంతా ఒక్క మాటగా ఒక్క బాటగా పనిచేయాలి అన్నారు. ప్రధానితోబాటు రక్షణమంత్రి శ్రీ స్వరణ్‌సింగ్, వాణిజ్య మంత్రి శ్రీ దినేష్ సింగ్, కుటుంబనియంత్రణ మంత్రి చంద్రశేఖర్ ఇంకా ఇతర ఉపమంత్రులు కొందరు కూడా ఈ సభలో పాల్గొన్నారు.

ప్రధాని తమ ప్రసంగంలో కటీషం పంజాబ్ కాంగ్రెస్ నాయకులంతా ఢిల్లీ వచ్చి తమతో ఐకమత్యంగా పనిచేస్తామని చెప్పారనికూడా వివరించారు.

---

# రైళ్లలో దొంగతనాలు చేసే ఆడదొంగల ముఠా అరెస్టు

విజయవాడ, డిసెంబరు 1 : గత పది పన్నెండు సంవత్సరాలుగా వివిధ రాష్ట్రాలలో రైళ్లలో స్త్రీల కంపార్టుమెంట్లలో ప్రయాణంచేస్తూ సూరుతాళాలతో పెట్టెలుతీసి బంగారు నగలు, విలువగల చీరెలు, రొక్కం మొత్తం సుమారు 2 లక్షల రూపాయల వరకు దొంగిలించిన ఆడదొంగల బృందం యిప్పుడు పట్టుబడ్డారు. వారివద్ద 10 వేల రూపాయల విలువగల చీరెలు, 68 వేల రూపాయల విలువగల బంగారునగలు పట్టుబడ్డాయి. ఈ బృందంలోని 4 గురు స్త్రీలు అరెస్టు చేయబడ్డారు.

ఈ ఉదంతాన్ని బెంగుళూరులోని పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు శ్రీ ఆర్. విక్టర్ నిన్న యిక్కడ ఆంధ్రపత్రిక ప్రతినిధికి వివరించారు.

ఈ ఆడదొంగల బృందంలో నలుగురున్నారు. వారు (1) కాలిపేక కాలమ్మ అనే లక్ష్మి (బెంగుళూరు—వయస్సు 35 సంవత్సరాలు). (2) సరస (వయసు 11 సంవత్సరాలు—బెంగుళూరు). (3) వల్లి (45 సంవత్సరాలు —వెల్లూరు, ప్రస్తుతం బెంగుళూరు), (4) పుష్ప (తిరునల్వేలి, ప్రస్తుతం బెంగుళూరు). వీరంతాకొంతకాలంగా బెంగుళూరులో వుంటున్నారు.

3వ తరగతి స్త్రీల కంపార్టుమెంటులో ప్రయాణం చేస్తారు. మిగతా ప్రయాణికులతో అతిస్నేహంగా మెలుగుతూ ముచ్చట్లు చెపుతారు. ఒళ్లు తెలియకుండా నిద్రపోయే మాత్రలు, మారుతాళం చేతుల గుత్తి వారి వద్ద వుంటాయి. ప్రక్కవారు తలకాయ నొప్పిగా వుందనో ఏదైనా అంటే యీ మాత్ర ఒకటి యిస్తారు. అంతటితో మొద్దు నిద్దరపోతారు. మారుతాళంచేయిపెట్టి పెట్టెలు తీసి దొంగతనం చేస్తారు. ట్రాన్సిస్టర్లు, కెమేరాలు కూడా వీరు దొంగిలించినవి కొన్ని స్వాధీనమైనాయి. ఒక్కొక్కప్పుడు సూటకేసులనే అమాంతంగా పట్టుకుపోతారు.

ఈ నలుగురు యిదివరలో శిక్షపొందిన నేరస్థులే. మద్రాసు, విజయవాడ, రాజమండ్రి వరంగల్, గూడూరు మొదలగు ఆంధ్రప్రాంతాలలోను, బొంబాయి, హైదరాబాద్, సూరత్, అహమ్మదాబాద్, బరోడా మధ్య ప్రాంతాలలోను, బొంబాయి, ఢిల్లీమధ్య ప్రాంతాలలో, ఢిల్లీ, హావ్‌డా మధ్య, హావ్‌డా మద్రాసులమధ్య విజయవాడ, హైదరాబాద్‌ల మధ్య యీ దొంగతనాలు జరిగాయి.

రకరకాల బంగారు గాజులు, గొలుసులు వున్నాయి. గత 10, 12 సంవత్సరాలలో బంగారు గాజులు, గొలుసులు పోయినవారు బెంగుళూరులో శ్రీ ఆర్. విక్టర్, పోలీసుసర్కిల్ ఇన్‌స్పెక్టర్, సైకిల్‌స్క్వాడ్ కమిషనర్ ఆఫీసు, ఇన్‌ఫెంట్రీరోడ్, బెంగుళూరు—2లో గాని లేక శ్రీ ఆర్. విక్టర్, పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు, సిల్వర్ జూబిలీ పార్కు పోలీసు స్టేషన్, బెంగుళూరు—2లోగాని కలుసుకొని ఆ సొమ్ములు ఆనవాలుపట్టి తెచ్చుకోవచ్చు నని శ్రీ విక్టర్ విజ్ఞప్తి చేశారు.

సుమారు ఒక సంవత్సరం క్రిందట విజయవాడ దుర్గాకళామందిరంలో ఒక పిల్లమెళ్లో నుండి దొంగిలింపబడిన పులిగోరు గొలుసు యిప్పుడు దొరికింది. ఆ రోజు సినిమా విశ్రాంతి సమయానికి ముందుగానే యీ దొంగతనం జరిగిందని. జరగగానే తల్లి గగ్గోలు పెట్టిందని తెలుస్తోంది. ఆ గొలుసు పోయినవారు బెంగుళూరులోని శ్రీ ఆర్. విక్టర్‌ని కలుసుకుని వస్తువును ఆనవాలుపట్టి తీసుకోవచ్చు.

---

# మైసూరు - కేరళ సరిహద్దులు బంద్

బెంగుళూరు, డిసెంబర్ 1 : కేరళ వ్యతిరేకవాదులు రాష్ట్రంలోకి అక్రమంగా ప్రవేశించకుండా నిరోధించడం కోసం కేరళతో గల సరిహద్దులను బంద్‌చేసినట్లు మైసూరు ముఖ్యమంత్రి శ్రీ వీరేంద్ర పాటిల్ నిన్నిక్కడ విలేఖరులకు తెలియజేశారు.

---

# శ్రీ పిడపర్తి సీతారామశాస్త్రి మృతి

కాకినాడ, డిసెంబరు 1 : పాటశాలల 7వ రేంజ్ ఇన్‌స్పెక్టరు శ్రీ పిడపర్తి సీతారామశాస్త్రి 24వ తేదీన మరణించారు. ఆయన వయస్సు 50 సంవత్సరాలు. భార్య, తొమ్మిది మంది పిల్లలు ఉన్నారు. (స్వ.వి.)

# విచ్ఛిన్నకర శక్తుల నిరోధం అవసరం

## దేశ ప్రజలకు ప్రధానమంత్రి ఉద్బోధ

చండీగఢ్, డిసెంబర్ 1.

దేశాన్ని బలహీనపరచడానికి యత్నిస్తున్న విచ్ఛిన్నకర శక్తులతో పోరాటం జరుపవలసిందని ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ప్రజానీకానికి నిన్న ఉద్బోధించారు.

ప్రజలు, విదేశాలవల్ల కలిగే ప్రమాదాన్ని ఒకకంట కనిపెట్టి ఉండటమేకాక, చీలికలు సృష్టించి, దేశ సమైక్యతను విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నించే శక్తులతో పోరాటం జరపాలని కూడా శ్రీమతి గాంధి ఇక్కడకు సుమారు ఎనిమిది మైళ్ళ దూరంలోని ఖరార్‌వద్ద ఒక బహిరంగసభలో మాట్లాడుతూ అన్నారు.

జాతి సమైక్యత అత్యంతావశ్యకమని నొక్కి చెబుతూ, అన్ని మతాలకు చెందినవారు శాంతియుత సహజీవనాన్ని కొనసాగించాలనీ, దేశాభ్యుదయానికి ఇది ఎంతైనా అవసరమనీ శ్రీమతి గాంధి తెల్పారు.

దేశ ఆర్థిక వ్యవస్థ గత మూడేళ్ళగా క్లిష్టకాలాన్ని అధిగమించి, ఇప్పుడిప్పుడే పుంజుకుంటున్నదనీ, దేశాభ్యుదయంకోసం కృషి చేయవలసిన బాధ్యత భారతీయులందరి మీద ఉన్నదనీ ప్రధాన మంత్రి అన్నారు.

దుర్భిక్షం, వరదలు, ఆహార ధాన్యాలకొరత వంటి పెక్కు సమస్యలను ప్రజలు ధైర్యంగా ఎదుర్కొన్నారనీ, దుర్బలమైన జాతి ఇన్ని ఇబ్బందులను తట్టుకుని నిలువగలిగేదికాదనీ కూడా ఆమె అన్నారు.

ప్రతి భారతీయుడు తన బాధ్యతలను గుర్తెరిగి, గాంధిజీ, జవహర్‌లాల్ నెహ్రూ మొదలైన నాయకులు కన్న కలలను నెరవేర్చాలని ప్రధాన మంత్రి హితవు చెప్పారు.

### ప్రజలకు వైద్య వసతుల విస్తరణ

ఆధునిక వైద్యం పట్ల ప్రజల వైఖరిలో పెద్ద పెట్టున మార్పు వచ్చినప్పటికీ, దేశంలో వైద్యసదుపాయాలుతగినంతగాఅభివృద్ధి చెందకపోవడం విచారకరమని శ్రీమతి గాంధి నిన్న ఇక్కడ పోస్టుగ్రాడ్యుయేట్ వైద్య విద్యా సంస్థలో రెండవ విభాగానికి ప్రారంభోత్సవం జరుపుతూ అన్నారు.

పెద్ద ఆధునిక ఆస్పత్రి ప్రజలను రక్షించే ఒక కోటవంటిదని చెబుతూ, అది వారి ఆరోగ్యాన్ని సంరక్షిస్తుందన్నారు.

దేశంలో ప్రతిగ్రామం ఆస్పత్రికి తగు మాత్రం దూరంలో ఉండాలని శ్రీమతి గాంధి సూచించారు. పల్లెజిల్లాలోని ఆస్పత్రులను వైద్యశాలలను, ఇతర ఆరోగ్య కేంద్రాలను అభివృద్ధి పరచడం అవసరమని ఆమె ఈ సందర్భంలో నొక్కి చెప్పారు.

వచ్చే పదేళ్లలో మందుల ధరలు తగ్గించి అధికోత్పత్తి సాధించేందుకు కృషి చేయవలసిందని శాస్త్రవేత్తలకు శ్రీమతి గాంధి విజ్ఞప్తి చేశారు.

కొత్త మందులపై పరిశోధన జరిపేందుకు పోస్టు గ్రాడ్యుయేట్ వైద్య విద్యా కేంద్రంలో ఒక శాఖ ఏర్పడినందుకు ప్రధాన మంత్రి ఆనందం వ్యక్తం చేశారు.

దేశంలో చాలాకాలంగ వాడుకలో మందులను పరీక్షించి, ఉపయోగించవలసిందని వైద్య శాస్త్ర వేత్తలకు ఆమె విజ్ఞప్తి చేశారు. పారిశుధ్యం ఆరోగ్యానికి ప్రాతిపదికవంటిదనీ, పౌరులు పౌరభావాన్ని అలవరచుకున్నప్పుడు పారిశుధ్యం అభివృద్ధి చెందుతుందనీ చెప్పారు.

వైద్యులు గ్రామాలకు వెళ్లి దీక్షగా ప్రజలకు సేవ చేయాలని శ్రీమతి గాంధి హితవు చెప్పారు.

—:o:—

# రష్యాచే ఉపగ్రహ ప్రయోగం

మాస్కో, డిసెంబర్ 1 : సోవియెట్ యూనియన్ నిన్న మరొక ఉపగ్రహాన్ని ప్రయోగించిందని టాస్ తెలియజేసింది.

"కాస్మాస్ 256" అనే ఈ ఉపగ్రహంలో రోదసీ పరిశోధనకు ఉపకరించే శాస్త్రీయ పరికరాలు ఉంచారు.

# మనాలీలో గులాబీతోట

## నెహ్రూస్మృతి చిహ్నంగా ఏర్పాటు

సిమ్లా, డిసెంబర్ 1 : మనాలీలోని అటవీ శాఖ విశ్రాంతి భవనంలో స్వర్గీయ నెహ్రూ స్మృతి చిహ్నంగా ఒక గులాబీ తోటను పెంచాలని హిమాచల్‌ప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించింది.

స్వర్గీయ నెహ్రూ తమ విశ్రాంతి సమయాలను ఈ ప్రదేశంలో గడిపేవారు. ఇప్పుడీ తోటలో ప్రపంచంలోని అత్యుత్తమ గులాబీ మొక్కలను పెంచబోతున్నారు. (నాఫెన్)

—:o:—

# కిరసనాయిలుఉత్పత్తి రంగం : 2 ఏళ్ళలో స్వయంసాధన

గౌహతి, డిసెంబరు 1 : కిరసనాయిలు దిగుమతులు బాగా తగ్గిపోయినట్లు ప్రభుత్వ మానె సంస్థ వర్గాల ద్వారా తెలుస్తున్నది. 1965 లో భారతదేశం 11.97 లక్షల టన్నుల కిరసనాయిలు దిగుమతి చేసుకొనగా ఈ సంవత్సరం 4 లక్షల టన్నులు మాత్రమే దిగుమతి చేసుకున్నట్లు తెలుస్తున్నది.

రాగల రెండు మూడు సంవత్సరాలలో భారత దేశం కిరసనాయిలు విషయంలో స్వయం సమృద్ధి సాధించగలదని భావిస్తున్నారు.

(యు. ఎన్. ఐ.)

# నాగర్‌కోయిల్ ఉప ఎన్నిక

## కామరాజు ప్రకటన

నాగర్ కోయిల్, డిసెంబరు 1 :

నాగర్‌కోయిల్ పార్లమెంటరీ నియోజకవర్గంనుంచి జరుగనున్న ఉప ఎన్నికలో కాంగ్రెసు అభ్యర్థిగా పోటీ చేయవలసిందని కన్యాకుమారిజిల్లా ప్రజలు చేసిన అభ్యర్థనను తాము ఆమోదించినట్లు శ్రీ కె. కామరాజు నిన్న చెప్పారు.

ఈ సమీపంలోని కరుంగల్ వద్ద నిన్న రాత్రి ఏర్పాటైన ఒక బహిరంగ సభలో ప్రసంగిస్తూ ఆయన ఈ ప్రకటన చేశారు.

ఈ ఉప ఎన్నికలో శ్రీ కామరాజు స్వతంత్ర, అతివాద కమ్యూనిస్టు పార్టీల అభ్యర్థుల పోటీని ఎదుర్కొనవలసి వస్తుంది.

# "ప్రణాళిక విషమ పరిస్థితిలో ఉంది"

## నంబూద్రిపాద్ అభిప్రాయం : రాష్ట్రాల పట్ల కేంద్రం వైఖరిపై నిశిత విమర్శ

త్రివేండ్రం, డిసెంబర్ 1 :

"ప్రణాళిక విషమ పరిస్థితిలో ఉంది" అని కేరళ ముఖ్యమంత్రి శ్రీ ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్ నిన్న ఇక్కడ అన్నారు

ప్రస్తుతం అనుసరిస్తున్న విధానాలకు ప్రణాళిక ప్రధాన లక్ష్యాలను సాధించే సత్తా లేకపోవడమే ఈ విషమ పరిస్థితికి మూలకారణమనికూడా శ్రీ నంబూద్రిపాద్ పత్రికా విలేఖరుల గోష్ఠిలో మాట్లాడుతూ తెల్పారు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల వనరుల సమీకరణకు, విదేశీ సహాయానికి, పెట్టుబడికి సంబంధించి ధరల స్థాయికి సంబంధించి అనిశ్చయ పరిస్థితి ఏర్పడిందని, మొన్న జాతీయాభివృద్ధి మండలి సమావేశంలో పలువురు ముఖ్య మంత్రులు ఈ సమస్యలను ప్రస్తావించారని ఆయన చెప్పారు. "ప్రణాళికలను శ్రద్ధగా అధ్యయనం చేసేవారు ఎవరైనాసరే ఈ సమస్యలను గూర్చి యోచించక తప్పదు" అని వివరించారు.

1969—70లో ఒక వార్షిక ప్రణాళిక రూపొందాలనీ, నాలుగవ ప్రణాళిక 1970—71 లో ప్రారంభం కావాలనీ మొన్నటి సమావేశంలో సూచించబడిందని శ్రీ నంబూద్రిపాద్ తెలియజేశారు. పంచవర్ష ప్రణాళికలకు బదులుగా సప్త వర్ష ప్రణాళికలు రూపొందించుకోవాలనికూడా సూచించబడిందన్నారు.

నాలుగవ ప్రణాళిక అమలుకు గాను రాష్ట్రాలకు కేంద్రం చేసే గరిష్ఠ సహాయాన్ని రు. 3500 కోట్లకు పరిమితం చేస్తూ కేంద్ర మంత్రివర్గం ఒక నిర్ణయానికి వచ్చినట్లు మొన్నటి సమావేశంలో చెప్పబడిందనీ, రాష్ట్రాలు అదనపు వనరులు సేకరించగలిగితే, తమ ప్రణాళికలను పెంచుకోవచ్చునని ఆయన చెప్పారు.

"మేము జాతీయాభివృద్ధి మండలి సభ్యులమని అనిపించుకుంటున్నాం. అయితే కేంద్రం పెట్టుబడి విషయంలో మేము నోరు ఎత్తే వీలులేదు. కేంద్రానికి సంబంధించినంత వరకు రు. 3500 కోట్లు ఇవ్వడానికి అది తాత్కాలికంగా అంగీకరించింది. రాష్ట్రములు అదనపు వనరులు సేకరించుకోవాలి. దీనిని ప్రణాళిక అని అనగలమా ?" అని శ్రీ నంబూద్రిపాద్ అడిగారు.

అదనపు వనరులు ఏ మేరకు సమీకరించాల అన్నది సమస్య కాదనీ, ఏ మేరకు అవి లభ్యం అవుతాయన్నదే సమస్య అనీ శ్రీ నంబూద్రిపాద్ అన్నారు.

ఇది "పెట్టుబడిదారీ ప్రణాళిక" కనుక, విషమ పరిస్థితిని ఎదుర్కొంటున్న దని మొన్నటి సమావేశంలో తాము స్పష్టం చేశామనీ, కేవలం లక్ష్యాలను నిర్ణయించడంతో కేంద్రం సంతృప్తి చెందుతున్నదనీ ఆయన అన్నారు. ఫ్యాక్టరీలు, మిల్లులు భారీ సంఖ్యలో మూతపడి, నిరుద్యోగం సంప్రాప్తిస్తే సహాయక చర్యలకై రాష్ట్రాలు భారీ మొత్తాలను ఖర్చు చేయగలుగుతాయా అని ఆయన ప్రశ్నించారు.

వాదుపు విషయంలో రాష్ట్రాలకు తాను చేస్తున్న హితోపదేశాన్ని కేంద్రం స్వయంగా ఆచరించటం లేదనీ, రక్షణేతర రంగంలో పెక్కు మంత్రిత్వ శాఖలను మూసివేయవచ్చునని సూచించటం జరిగిందని, రక్షణ శాఖ ఖర్చులనుకూడా చాలావరకూ తగ్గించుకోవచ్చునని శ్రీ నంబూద్రిపాద్ అన్నారు.

పెట్టుబడిదారీ ప్రణాళికలకు, సోషలిస్టు ప్రణాళికలకు తేడా ఉన్నదనీ, దేశ పరిస్థితులకు అనుగుణంగా మనం ప్రణాళికను రూపొందించుకోవాలనీ ఆయన చెప్పారు.

"మనకు సోషలిస్టు ప్రణాళిక అవసరమని నా అభిప్రాయం. అనగా ఆస్తి సంబంధాలలో మార్పులు ప్రాతిపదికగా అది రూపొందాలని నా అంతర్యం" అని కూడా ఆయన తెలిపారు.

ఇది పరిష్కారమైనప్పుడు, పరిశ్రమలకు, వ్యవసాయానికి మధ్యను, కీలక పరిశ్రమలకు, ఇతర పరిశ్రమలకు మధ్యను, ఉండవలసిన దామాషావంటి ఇతర సమస్యలు తేలికగా పరిష్కారం కాగలవని శ్రీ నంబూద్రిపాద్ తెలియజేశారు.

### కమ్యూనిస్టులపై విమర్శలకు జవాబు

"విప్లవానికి అనువైన వాతావరణం ఏర్పడుతుందన్నభావంతో ఆదేశం ఆర్థికపరిస్థితి అధ్వాన్నంగా తయారు కావాలని కమ్యూనిస్టులు ఆశిస్తున్నారనడం, ఏళ్ల తరబడి జరుగుతున్న దుష్ప్రచారం"గా శ్రీ నంబూద్రిపాద్ అభివర్ణించారు.

ప్రణాళిక విషమ పరిస్థితిలో ఉన్నదని శ్రీ నంబూద్రిపాద్ అన్నప్పుడు, దేశ ఆర్థిక పరిస్థితి దిగజారి పోవాలని కొన్ని పార్టీలు ఆశిస్తున్నమాట వాస్తవమేనా ? అని ఒక విలేఖరి ఆయనను ప్రశ్నించాడు.

శ్రీ నంబూద్రిపాద్ ఇందుకు ప్రత్యుత్తరమిస్తూ, "న్యాయంగా మాట్లాడండి. మిమ్మల్ని మీరు మోసగించుకోకండి" అని అన్నారు.

"పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ అధ్వాన్నంగా తయారుకాక తప్పదు. మొదటి ప్రపంచ యుద్ధానంతర కాలంలో మాదిరిగా ఇది విప్లవ వ్యతిరేక విప్లవానికి దారితీయవచ్చు. విప్లవవాదులకు సంబంధించినంత వరకు అధ్వాన్న పరిస్థితిని వీలైనంతవరకు బాగుపరచడమే వారి లక్ష్యం. వారు ఎంతగా ప్రయత్నించినప్పటికీ, తప్పుడు విధానాల మూలంగా పరిస్థితి అధ్వాన్నంగా తయారుకాక తప్పదు" అనికూడా ఆయన అన్నారు.

# హైదరాబాదు పూనా నగరాల మధ్య విమానాలు

## త్వరలో ప్రారంభం

హైదరాబాద్, డిసెంబర్ 1 : త్వరలో పూనా—హైదరాబాద్ నగరాల మధ్య విమానయాన సదుపాయాలు ఏర్పడవచ్చునని ఇండియన్ ఎయిర్‌లైన్స్ కమర్షియల్ మేనేజర్ శ్రీ బి.ఎన్. భట్నాగర్ నిన్న ఇక్కడ చెప్పారు.

నాలుగవ పంచవర్ష ప్రణాళిక అంతానికి 101 సీట్లు ఉండే ఎనిమిది జెట్ విమానాలు ఆరు షార్ట్ రేంజ్ (షార్ట్—హాల్) విమానాలు 14 హెచ్.ఎస్. 748 విమానాలు ఇండియన్ ఎయిర్‌లైన్స్ సంస్థ కొనుగోలు చేయవలసిందనీ, ఇందుకు సుమారు రు. 53 కోట్లు ఖర్చు కాగలదని ఆయన తెలియజేశారు.

# హరిజనులపై గుజరాత్ గ్రామంలో స్త్రీలచే రాళ్లు

## ఆలయ ప్రవేశ ప్రయత్నానికి వ్యతిరేకత

మెహసానా (గుజరాత్), డిసెంబరు 1 :

మెహసానాజిల్లా ఎహాక్ గ్రామంలో ఒక దేవాలయానికి వెళుతున్న, మహిళల బృందం రాళ్లురువ్వగా ఒక పోలీసు కానిస్టేబిల్‌తో సహా ఆరుగురు వ్యక్తులు గాయపడ్డారు.

దేవాలయ ప్రవేశ కార్యక్రమంలో పాల్గొనడానికి సుమారు మూడు వందల మంది హరిజనులు జిల్లా అంతటినుంచి ఎహాక్‌కు వచ్చారు.

వారు ఒక దేవాలయం ప్రవేశించారు. వారు మరొక దేవాలయానికి పోతుండగా, మహిళల గుంపు వారిపై రాళ్లు విసిరినట్లు తెలుస్తున్నది.

శాంతిభద్రతలను కాపాడడం కోసం మెహసానా, కలోలనుంచి పోలీసు బలగాన్ని హుటాహుటిన అక్కడకు తరలించారు.

గాయపడినవారిని చికిత్స నిమిత్తం కలోల్‌కు పంపడం జరిగింది.

—:o:—

# బస్సు బోల్తాపడగా 15మంది బాలికలకు గాయాలు

## త్రిచూర్ వద్ద దుర్ఘటన

త్రిచూర్, డిసెంబరు 1 : త్రిచూర్‌లోని సెయింట్ థామస్ హైస్కూలుకు చెందిన బాలికలు ప్రయాణిస్తున్న బస్సు ఇక్కడికి తూర్పుగా పది మైళ్లదూరంలో గల కుధిరాన్ వద్ద తలక్రిందులుకాగా సుమారు 15 మంది బాలికలు గాయపడ్డారు.

గాయపడినవారిని ఇక్కడి ఆసుపత్రిలో చేర్చారు.

—:o:—

# ముస్లింలీగ్ ఒత్తిడి వల్లనే కొత్త జిల్లా

## కేరళ ప్రతినిధివర్గం వివరణ

న్యూఢిల్లీ, డిశంబర్ 1 : ఢిల్లీలో కేంద్ర నాయకులకు విజ్ఞప్తి చేయటానికై వచ్చిన కేరళ జిల్లాల విభజన వ్యతిరేక సంఘం నిన్న విలేఖరులతో ప్రసంగిస్తూ కేరళ ప్రభుత్వం గైకొనదలచిన ఈ చర్యవలన దేశం మరొకసారి విభజింపబడడానికి నాంది అయిందని అన్నారు.

కొత్త జిల్లాల ఏర్పాటులో పరిపాలనా సౌకర్యం ఏమీ లేదనీ, కేరళ ఫ్రంట్‌లో బలమైన పక్షంగా ఉన్న ముస్లింలీగ్ ఒత్తిడికి తట్టుకొనలేకనే ముఖ్యమంత్రి ఈ చర్యకు పూనుకున్నారనీ వారు వివరించారు.

దేశ విభజన రోజులలోనే కేరళలో కొన్ని జిల్లాలతో మోపలస్థాన్ ఏర్పాటుచేయాలని ముస్లింలీగ్ నాయకులు ప్రకటనలు చేశారని ప్రతినిధివర్గం సభ్యులు పేర్కొన్నారు.

ఈ ప్రతినిధివర్గంలో సర్వోదయ నాయకుడు శ్రీ పి. కుట్టిశంకరన్‌నాయర్, శ్రీ ఆర్. పి. వేలాయుధన్, శ్రీ ఒ.రాజగోపాలన్ ఉన్నారు. శ్రీ ఒ. రాజగోపాలన్ రాష్ట్ర జనసంఘ కార్యదర్శి.

# గాంధీ శతజయంతి ఉత్సవాల్లో రైల్వే కన్సెషన్ టికెట్లు

న్యూఢిల్లీ, డిశంబర్ 1 : గాంధి శత జయంత్యుత్సవ సందర్భంగా, గాంధిజీ జీవితంతో సంబంధం ఉన్న 35 ప్రదేశాలకు వెళ్లే రైలు ప్రయాణికులకు టికెట్‌రుసుంలో 25 శాతం మినహాయింపు సౌకర్యాన్ని కలుగజేస్తున్నారు.

గాంధి శతజయంత్యుత్సవ సంఘంతో సంప్రదించి రైల్వే బోర్డు ఈ 35 ప్రదేశాలను నిర్ణయించారు. వీటిలో వీరాంగం, రాజకోట, పోరుబందరు, అహమ్మదాబాద్, వార్ధా, బోర్డోలీలుకూడా ఉన్నాయి.

మినహాయింపు సౌకర్యం గల టికెట్లను 1969 జనవరి 1 నుంచి సెప్టెంబరు 30వ తేదీ వరకు విక్రయిస్తారు. ఈ టికెట్లను కొన్న తేదీనుండి 90 రోజులలోగా ఈ సౌకర్యాన్ని వినియోగించవలసి ఉంటుంది.



Printed and Published for Nageswara Rao Estates Private Ltd. by S. Radhakrishna at the Andhra Patrika Press Gandhinagar, Vijayawada—3. Editor: S. Sambhu Prasad Phone : Vijayawada 5667 & 5226